ఓ3మ్

# ప్రకాశకీయం

మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలలో ఇది 25వ కుసుమం. ఇంతవరకూ అనేక సిద్ధాంత గ్రంథాలు, నీతి గ్రంథాలు, మహాపురుషుల చరిత్రలు పాఠకులకందించిన మా ట్రస్టు ప్రప్రథమంగా ఈసారి అమర వీరుల వీరగాథలను కూడా పరిచయం చేస్తున్నది.

బలిదానంలో "వీరతృతీయ"గా ఖ్యాతిగాంచిన పండిత లేఖరాం గారు తన 39 సం॥రంల జీవన సమయంలో దాదాపు 20 సం॥రంలు పైగా వైదిక ధర్మప్రచారం కొరకు వెచ్చించారు. 35 సం॥రంల వయస్సులో వివాహం చేసుకొని 5సం॥రంల. వైవాహిక జీవనాన్ని కూడా గడుపని నిరంతర కార్యశీలి. వీరి ధర్మపత్ని లక్ష్మీదేవికూడా త్యాగమయ జీవనం గడుపుటలో వీరికి సాటియైన మహిళ. వైదిక ధర్మప్రచారంలో అహర్నిశలు శ్రమించే తన పతిదేవునకు అవకాశం లభించినపుడల్లా తగిన సేవలొనర్చుచూ ఆయనను సంతోషపెట్టుటకై ఈ శ్రీదేవి ప్రయత్నించుచుండెడిది.

భయమనే మాట ఎన్నడూ ఎరుగని మేరునగధీరుడైన ధర్మవీర్ పం. లేఖరాంగారు నేటి ఆర్యులకు ఒక మహోన్నత ప్రేరణదాయక ఆత్మ. వీరి కార్యశైలిని, ఆదర్శ నిరాడంబర జీవనమును, వైదిక ధర్మము ఎడల, సమాజసేవ ఎడల, సదాచారంపట్ల, వీరికి గల శ్రద్ధాసక్తులను ఆదర్శంగా తీసుకొని నడిచే ప్రతివ్యక్తి ఒక ఆర్యపథికుడై పరమపిత పరమాత్మ ఒసంగిన మానవజీవనమును సాఫల్యము గావించుకొనుననుటలో ఎట్టి సందేహముండదు.

అమరవీరుడు పండిత. లేఖరాంగారి బలిదాన శతాబ్దిని ఆర్యజగత్తంతా ఎంతో ప్రేరణదాయకంగా జరుపుకుంటున్న తరుణంలో తెలుగు చదువరులకు మా ట్రస్టు అందించుచున్న ఈ పుస్తకం ఒక చిరుకానుక.

మాతోపాటు ఒక వెయ్యి ప్రతులు ముద్రించుటకు నిర్ణయించిన శ్రద్ధాబాద్ ఆర్యసమాజం వారికి మా కృతజ్ఞతాపూర్వక అభినందనలు తెలియజేయుచున్నాము.

మీ

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు సభ్యులు



# ధర్మవీర్
# పండిత లేఖిరాం

హిందీ మూలం:
త్రిలోక్ చంద్ర విశారద

అనువాదం:
సంధ్యావందనం శ్రీనివాసరావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

ఓ౩మ్

# ప్రకాశకీయం

మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలలో ఇది 25వ కుసుమం. ఇంతవరకూ అనేక సిద్ధాంత గ్రంథాలు, నీతి గ్రంథాలు, మహాపురుషుల చరిత్రలు పాఠకులకందించిన మా ట్రస్టు ప్రప్రథమంగా ఈసారి అమర వీరుల వీరగాథలను కూడా పరిచయం చేస్తున్నది.

బలిదానంలో "వీరతృతీయ"గా ఖ్యాతిగాంచిన పండిత లేఖరాం గారు తన 39 సం॥రంల జీవన సమయంలో దాదాపు 20 సం॥రంలు పైగా వైదిక ధర్మ ప్రచారం కొరకు వెచ్చించారు. 35 సం॥రంల వయస్సులో వివాహం చేసుకొని 5సం॥రంల. వైవాహిక జీవనాన్ని కూడా గడుపని నిరంతర కార్యశీలి. వీరి ధర్మపత్ని లక్ష్మీదేవికూడా త్యాగమయ జీవనం గడుపుటలో వీరికి సాటియైన మహిళ. వైదిక ధర్మప్రచారంలో అహర్నిశలు శ్రమించే తన పతిదేవునకు అవకాశం లభించినపుడల్లా తగిన సేవలొనర్చుచూ ఆయనను సంతోషపెట్టుటకై ఈ శ్రీదేవి ప్రయత్నించుచుండెడిది.

భయమనే మాట ఎన్నడూ ఎరుగని మేరునగధీరుడైన ధర్మవీర్ పం. లేఖరాంగారు నేటి ఆర్యులకు ఒక మహోన్నత ప్రేరణదాయక ఆత్మ. వీరి కార్యశైలిని, ఆదర్శ నిరాడంబర జీవనమును, వైదిక ధర్మము ఎడల, సమాజసేవ ఎడల, సదాచారంపట్ల, వీరికి గల శ్రద్ధాసక్తులను ఆదర్శంగా తీసుకొని నడిచే ప్రతివ్యక్తి ఒక ఆర్యపథికుడై పరమపిత పరమాత్మ ఒసంగిన మానవజీవనమును సాఫల్యము గావించుకొనుననుటలో ఎట్టి సందేహముండదు.

అమరవీరుడు పండిత. లేఖరాంగారి బలిదాన శతాబ్ధిని ఆర్యజగత్తంతా ఎంతో ప్రేరణదాయకంగా జరుపుకుంటున్న తరుణంలో తెలుగు చదువరులకు మా ట్రస్టు అందించుచున్న ఈ పుస్తకం ఒక చిరుకానుక.

మాతోపాటు ఒక వెయ్యి ప్రతులు ముద్రించుటకు నిర్ణయించిన శ్రద్ధాబాద్ ఆర్యసమాజం వారికి మా కృతజ్ఞతాపూర్వక అభినందనలు తెలియజేయుచున్నాము.

మీ

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు సభ్యులు**



# ధర్మవీర్
# పండిత లేఖిరాం

హిందీ మూలం:
త్రిలోక్ చంద్ర విశారద

అనువాదం:
సంధ్యావందనం శ్రీనివాసరావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 25
ప్రథమ ముద్రణము : ప్రతులు 2000
సృష్టి సంవత్సరము : 197,29,49,097
దయానందాబ్దము : 172
శ్రీ ధాత మాఘం : ఫిబ్రవరి 1997

మూల్యము : రూ. 3/-

(పోస్టు ఖర్చులు అదనము)

ప్రతులకు

1.) గాయత్రీ ఆశ్రమము
12-10-586/6. వ్యాస్‌నగర్ (మేడిబావి)
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

2) వైదిక సాహిత్య భండార్,
ఆర్యసమాజము, సుల్తాన్ బజార్,
హైదరాబాద్ - 500 195.

3) స్వస్తిక్ మెటల్ ప్రోడక్ట్స్,
3-3-738, కంచరి బజార్,
సికింద్రాబాద్ - 500 003.

4) శ్రీ ఆర్. కృష్ణమూర్తి, బుక్‌సెల్లర్స్,
ఆర్యసమాజమందిరము, మెయిన్ రోడ్డు,
సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061.

Designed & Printed at: **PRINTSHOP**, Secunderabad ©: 812904/818296

# ధర్మవీర్ పం. లేఖరాం

" ఏ సత్యగుణము కొఱకు ఒక మహాపురుషుడు తన ప్రాణాలను పణంగా పెట్టవలసి వచ్చిందో ఆ సత్యగుణము కూడా అంతగా వ్యాపకము కాగలిగినది" - ఈ మాటను ఆర్యపథిక్ లేఖరాం గారి జీవనము స్పష్టము చేసినది. పండిత లేఖరాం గారి బలిదానము వైదిక సిద్ధాంతములను వ్యాపింపజేయుటకు ఎంతగానో తోడ్పడినది. గౌరవమయ ఆర్యసమాజ చరిత్రలో వారిపేరు నిశ్చయంగా సువర్ణాక్షరాలతో వ్రాయదగినది. మనమటువంటి మహాపురుషుని కథను చదివి ఆయన నెలకొల్పిన ఆదర్శమార్గంలో నడచుటకు ప్రేరణ పొందుదము రండు!

రావల్పిండి జిల్లాలోని పోఠోహార్ ప్రాంతంలో నేడు గురుకులాలు స్థాపించబడిన చోట పం. లేఖరాం గారి వంశస్థులు నివసించుచుండిరి. లేఖరాం గారి తాతగారైన మహతా నారాయణ సింహ్‌గారి తండ్రి సయ్యద్‌పుర గ్రామమునకు వచ్చి స్థిరపడిరి. ఈ గ్రామం జీలం జిల్లాలోని చకవాల్ తాలూకాకు 8 క్రోసుల దూరాన తూర్పు దిశలో ఎత్తైన ప్రాంతంలో ఉన్నది. ధర్మవీర్ పం. లేఖరాం ఇచ్చటనే జన్మించిరి. ఈ గ్రామానికి మూడు వైపులా వర్షాకాలపు నదులు ప్రవహిస్తూంటాయి. పం. లేఖరాం గారి శారీరక, మానసిక స్థితిపై వీటి పూర్ణప్రభావం పడినది. ఆయన దృఢమైన పుష్టికరమైన శరీరంతో తీవ్రమైన భావాలు కలవారుగా రూపొందిరి. ఎటువంటి మొండివిరోధులను ఆయన శాస్త్రార్థ యుద్ధంలో పరాజయం గావించిరో పాఠకులు ముందుపుటలలో చదువుతారు.

**జననము - వంశ పరిచయం**

కథానాయకుని (పం. లేఖరాం) తాతగారైన మహతానారాయణ సింహ్‌గారికి ఇద్దరు కుమారులుండిరి. వీరు మహతా తారా సింహ్, మహతా గండా సింహ్‌లు. తారాసింహ్‌గారి ముగ్గురు కుమారులలో ఒకరు మన కథానాయకులైన వీర లేఖరాం గారు. వీరు వి.సం. 1915 చైత్రమాసంలో8వ తేదీన(1858 సం॥రం.లో) జన్మించిరి. మనదేశంలో ఆంగ్లేయుల రాజ్యం స్థాపించబడిన తరువాత వారు ప్రజల వద్దనుండి ఆయుధాలను స్వాధీనం

చేసుకొనిరి. వీరు స్వయంగా ఆయుధాలను ఆంగ్లేయులకు అప్పగించుట అవమానముగా భావించి పుంఛ్ రాజ్యమునకు వెళ్ళి అచ్చట తమ ఆయుధాలను అమ్మివేసిరి. ఆత్మగౌరవంతో కూడిన ఈభావన వీరి తమ్ముడు శ్యాం సింహ్‌లో నుండెను. శ్యాంసింహ్ జీవితాంతం బ్రహ్మచారిగ నుండి సిఖ్ఖుల రాజ్యపాలన అంతమైనపుడు సాధువుగా మారిరి. ఈ సంఘటనల ప్రభావం వీర లేఖరాం గారిపై కూడా పడినది.

**విద్యాభ్యాసం - జీవితారంభం**

6 సం॥రం.ల వయస్సులో లేఖరాంను తండ్రి గ్రామ పాఠశాలలో ఫారసీ ఉర్దూలు చదువుటకై పంపిరి. ముస్లిం రాజ్యం వచ్చినతరువాత అచ్చట ఉర్దూ ఫారసీ భాషలు పూర్తిగా చదివింపబడుచుండెను. లేఖరాం చదువుట-వ్రాయుటలో చాలా చలాకీగా ఉండేవారు. ఒకసారి విద్యాశాఖాధికారి పరీక్షించుటకై వచ్చినపుడు వీరు తన విద్యాబుద్ధులను ప్రదర్శించి విశేష బహుమానమును పొందిరి. వీరు తన 11వ ఏట పోలీసు శాఖలో ఉద్యోగియైన తన పిన తండ్రిగారి వద్దకు పెషావర్ వెళ్లిరి. అచ్చట వీరి చదువు నిమిత్తం ఒక ముస్లిం అధ్యాపకుని వీరి పినతండ్రి నియమించిరి. అధ్యాపకుడు ఈ బాలునిపై ముస్లిం భావలను వేయుటకు ప్రయత్నించుచుండెను. కాని బాలుడైన లేఖరాం సందేహాలకు సమాధానా లివ్వజాలక విసుగుచెంది చివరకు అతడు చదివించుట మానుకొనెను. ఇంతలోగా పినతండ్రిగారికి పెషావర్‌నుండి బదిలి ఐనది. ఎన్నో బదిలీల కారణంగా చదువు సరిగా సాగనందున లేఖరాం గారిని మరల సయ్యద్‌పురాకు పంపివేసిరి. అప్పుడాయన వయస్సు 14 సం॥రంలు. వీరు మరల గ్రామ పాఠశాలలో చదువసాగిరి. ముందువలెనే ప్రథానోపాధ్యాయుడు వీరిపై ఉన్నతమైన గౌరవభావంతో నుండెడివారు.

వీరు మొదటినుండి సామాన్యముగా ఉండేవారు. చొక్కాగుండీలు అలాగే (పెట్టుకోకుండా) ఉండేవి. తలపాగా కూడా ఊడిపోయి ఉంటుంది. ఆయనకు ముస్తాబగుట ఇష్టముండదు. ఆయన విద్యాబుద్ధులను గూర్చిఎక్కువగా చెప్పవలసినదేముంది. ఆయనేదైనా పుస్తకం చదువుతుంటే వెంటనే దానిలోని విషయాన్ని స్వయంగానే గ్రహించేవారు. ఆయనకు కవిత్వంపైకూడా మక్కువ ఉండేది.

### పోలీసు ఉద్యోగం

వి.సం. 1932 పుష్యమాసంలో (21-12-1875) వీరు పెషావర్‌లో పోలీసు ఉద్యోగంలో చేరిరి. అప్పుడాయన వయస్సు 17 సం॥రంలు. వీరి ఉద్యోగం 5సం॥రం లకు మించి చేయజాలకపోయిరి. వీరి మనస్సు ఈశ్వర-భక్తి విషయంపై లగ్నమగుటవలన పోలీసు ఉద్యోగం వారి మనస్తత్వానికి సరిపడలేదు. వారి పినతండ్రి సహవాసంలో ఉన్నప్పుడే మనస్సులో ఈశ్వరభక్తి అంకురించినది. ఒక సిక్కు సిపాయి నియమపూర్వకంగా భజనలు చేయుచుండెను. అతని ప్రభావం లేఖరాంపై పడినది. అప్పటినుండి ఆయన నిరంతరం ఈశ్వరోపాసన చేయుచుండెను. గీతాపఠనం చేయుట ఆయన కిష్టం. శ్రద్ధగా ప్రతిరోజు గీతాపాఠం చేయుచున్నందున కృష్ణునిపై భక్తి శ్రద్ధలు వృద్ధికాసాగినవి. పౌరాణిక పద్ధతిపై శ్రద్ధయున్నందున రాసలీలలలో రాత్రింబవళ్ళు గడుపుచుండిరి. కృష్ణనామ జపం అర్థసహితంగా చేయుచుండిరి. ఈ విధంగా కొంతకాలానికాయనకు పోలీసు జీవితంపై విరక్తి ఏర్పడి బృందావనమునకు ప్రయాణమయ్యేను.

### వివాహసమస్య

పుత్రునిలో వైరాగ్యపోకడలను చూచి తల్లి వివాహం చేయుట కొక కన్యను చూచెను. పినతండ్రి కూడా త్వరగా వివాహం చేయవలెనని సలహానిచ్చెను. కానీ లేఖరాం అందుకంగీకరించనందున వారిరువురు ఏమీచేయలేక ఆ కన్యను లేఖరాం తమ్ముడు తోతారాంకిచ్చి వివాహం జరిపించిరి.

### వైదిక ధర్మంవైపు మరలుట

క్రమంగా ఆయన మనస్సులో అన్ని మతాలపై ప్రేమభావమేర్పడినది. కాశీనుండి టీకా సహితంగా గీతను తెప్పించి చదివిరి. అప్పుడే పంజాబ్‌లో ప్రసిద్ధిగాంచిన సంఘసంస్కర్త కన్హయ్యలాల్ అలఖ్‌ధారీ గారి పుస్తకాలు చదివే అవకాశం లభించినది. వారి పుస్తకాల ద్వారానే ఋషి దయానందుని పరిచయమైనది. అప్పటివరకు ఆయన మనస్సులో తిష్ఠవేసిన అద్వైత మతంకనుమరుగు కాసాగెను. వార్తాపత్రికలలో కూడా ఋషిదయానందుని కార్యముల విజయనాదం వినిపించేది. దీనితో లేఖరాం గారిలో ప్రేరణ కలిగి ఋషి ప్రణీత గ్రంథాలను తెప్పించి చదివిరి. ఆ గ్రంథాలను అధ్యయనము చేసిన అద్వైతవాది లేఖరాం ఋషిదయానందుని అనుయాయియై వైదిక

ధర్మమునకు అసలైన సేవకునిగా తయారయ్యెను. ఋషి దయానందుని గ్రంథాల అధ్యయనం లేఖారాం భవిష్యత్తు జీవితంలో గొప్పపరిణామం (TURNING POINT) గా ఋజువయ్యెను.

**పెషావర్‌లో ఆర్యసమాజం**

పండిత లేఖరాం ఆర్యసమాజ సిద్ధాంతాలపై నడచుటకు నిర్ణయించిరి. ఆయన తన భావాలను కేవలం మాటలకే పరిమితం చేయకుండా క్రియాచరణలో పెట్టిరి. వి.సం. 1937లో (1880) వీరు పెషావర్ నగరంలో ఆర్యసమాజాన్ని స్థాపించిరి. వీరు పెషావర్‌లోని మాయిూరంజీ ధర్మశాలలో ఉండేవారు. ప్రారంభంలో సాప్తాహిక సమావేశాలన్నీ వారి నివాసంలోనే జరుగుతుండేవి. వీరు దైనిక సమావేశమును నిర్వహించుటకు కార్యక్రమము నేర్పరచి ధర్మంపై తనకు గల ఉత్సాహమును చాటి చెప్పిరి. ఆయన తన ముగ్గురు నలుగురు మిత్రులకు ధార్మిక విషయాలను తెలియజేస్తుండేవారు. పూర్తి ప్రయత్నంతో ప్రమాణపూరిత ఉపదేశాలతో వీరు తన మిత్రులను కూడా ఒకే భావాలు కలవారిగా చేసిరి.

**ఋషి దర్శనం**

ఋషి దయానందుని గ్రంథములద్వారా పరిచయం ఏర్పడిన నాటినుండి జ్ఞానభండారమైన ఆ ఋషి దర్శనం చేసుకోవాలనే కోరిక ఏర్పడినది. ఒక మాసం సెలవు తీసుకొని అజ్‌మేర్ వెళ్ళి సేఠ్‌ఫతేమల్ దేవిడీలో వీరు ఋషి దర్శనం చేసుకొనిరి.

అజ్‌మేర్ వెళ్ళేదారిలో జయపూర్‌లో ఒక బెంగాలీ, వ్యాపక పదార్థములైన ఆకాశము, బ్రహ్మతత్త్వములు రెండు ఒకే స్థానంలో ఎట్లుండగలవని పం. లేఖరాంను ప్రశ్నించెను. పం. లేఖరాం ఈ ప్రశ్నకు సమాధాన మివ్వలేకపోయెను. అందువలన ఇదే ప్రశ్నను ఆయన ఋషి దయానందుని అడుగగా, ఆయన ఒకరాతిని చూపించి - దీనిలో అగ్ని, మట్టి, పరమాత్మ ఈ మూడు వస్తువులు నిండియున్నవా? లేవా? అని అడిగిరి. ఒక సూక్ష్మ వస్తువు తనకంటె స్థూల వస్తువులో వ్యాపించియుండగలదు. అను సమాధానం విన్న పం. లేఖరాంకు చాలా ఆనందం కలిగినది.

పం. లేఖరాం ఋషి దయానందుని చాలా సందేహాలనడిగి తెలుసుకొనిరి.

పాఠకుల వినోదార్థం మూడు ప్రశ్నోత్తరాలను యిచ్చుట వ్రాయుచున్నాము.

లేఖరాం:- జీవ బ్రహ్మలు వేర్వేరని తెలిపే వేద ప్రమాణమేదైనా ఇవ్వండి.

ఋషి:- యజుర్వేదంలోని 40వ అధ్యాయం పూర్తిగా జీవబ్రహ్మల భేదమును తెలుపును.

లేఖరాం:- ఇతర మతాల వారిని శుద్ధిచేయాలా వద్దా?

ఋషి:- తప్పకుండా శుద్ధి చేయాలి.

లేఖరాం:- విద్యుత్తు ఏ వస్తువు? ఎట్లు తయారౌతుంది?

ఋషి:- విద్యుత్తు అన్నిస్థానములలో నున్నది. ఇది రాపిడివలన ఉత్పన్నమౌతుంది. మేఘములవలన పుట్టే విద్యుత్తు కూడా మేఘాలతో వాయువు రాపిడివలన పుట్టును.

ఋషి దయానందుడు పం. లేఖరాంను 25 సం॥రంల వయస్సుకు ముందుగ వివాహం చేసుకోరాదని ఆదేశించిరి. పం. లేఖరాం ఋషి ఆదేశమును పాలించెను. ఋషి దర్శనం తరువాత పండిత్‌జీకి వైదిక ధర్మంపై హిమాలయముల వలె అచంచల విశ్వాసమేర్పడినది. అంతులేని ఉత్సాహంతో ఆయన ధార్మిక సేవా కార్యము నారంభించిరి. వీరి సందేహాలన్నీ ఋషి దర్శనంతో తీరిపోయినవి. ఇక వారిని ఏ శక్తి వైదిక మార్గమునుండి మరల్చలేదు.

ధర్మప్రచారం కొఱకు ఒక పత్రిక అవసరమని, దాని వలన చదువుకున్న వారికి, ధర్మమును గూర్చి తెలుసుకోదలచిన వారికి ఆధ్యాత్మిక ఆహారం నియమపూర్వకంగా అందించగలిగి వారికి ధార్మిక వికాసం కలుగుటకు తోడ్పడగలదని ఆయనకు బాగా తెలుసును. కనుక ఆయన పెషావర్ ఆర్యసమాజం నుండి 'ధర్మోపదేశ' మనే మాసపత్రిక నడుపుటారంభించి దానికి వారు సంపాదకులుగ నుండిరి. ఈ పని చాలా శ్రమతో - బాధ్యతతో కూడినది.ఇదొక్కటే కాక పం. లేఖరాం గారు వ్యాఖ్యానములు కూడా చేయుచుండిరి. అందుకు తయారగుచుండిరి. వీరి వ్యాఖ్యానాలు చాలా ప్రతిభావంతములై అనేక మందిపై శాశ్వత ప్రభావమును కలిగించినవి. ఒకసారి వీరు మద్యనిషేధంపై వ్యాఖ్యానించుచుండిరి. శ్రోతలలో ఒక సైనికాధికారి కూడా ఉండెను. వీరి వ్యాఖ్యాన ప్రభావ మాసైనికాధికారిపై ఎంతగానో పడినది. అతడు తనసైన్యంలో మద్యపానమును పూర్తిగా నిషేధించెను.

వ్యాఖ్యానములు, రచనాకార్యక్రమములతో పాటు వీరు శాస్త్రార్థము చేయుటలో కూడా మిక్కిలి ఆసక్తి చూపుచుండేవారు. పోలీసు సూపరింటెండెంట్ తన డిప్యూటీ లీడర్ వజీర్ ఆలీతో సామాన్యంగా పం. లేఖరాంచే వాదన చేయించుచుండిరి. ఆయన స్వయంగా పం. లేఖరాంను సమర్థించుచుండిరి. అందరికీ బాగా ఉల్లాసాన్ని కలిగించే విషయంపై చర్చ జరుగుతుండేది. స్వయంగా పోలీసు సూపరింటెండెంట్ మహోదయుడు చర్చలో పాల్గొని ఆనందించుచుండేవారు. కానీ క్రొత్త సూపరింటెండెంట్ రాగానే పం. లేఖరాంను పెషావర్ నుండి 'సుఆబీ' ఠాణాకు మార్చివేసిరి. సుఆబీకి వచ్చిన తరువాత కూడా వీరు నియమంగా పత్రికకు వ్యాసాలతోపాటు సమాజ మాస చందా నూటికి రూ. 5/-లు నిరంతరం పంపుచుండిరి. ఎలాంటి పరిస్థితులైనా ఆయనకు ధర్మంపైగల ఉత్సాహాన్ని శిథిలంచేయలేక పోయెడివని చెప్పుటకిదొక ముఖ్య ఉదాహరణ.

**పోలీసు ఇన్‌స్పెక్టర్‌తో శాస్త్రార్థం**

ఒకసారి సుఆబీ ఠాణాకు పోలీసు ఇన్‌స్పెక్టర్ వచ్చినపుడు ఆయన లేఖరాం గారి ధార్మిక చర్చను పరీక్షించుటకై స్వయంగా వివాదమును లేవదీసెను. అంతే. ఇంకేముంది.! పం. లేఖరాం గారు ముఖం వాచేటట్లు గట్టిగా జవాబిచ్చిరి. వాదోపవాదాలలో సత్య-అసత్యములకు సంబంధించినంత వరకు లేఖరాం గారి జవాబులు సరైనవే. కానీ పోలీసు ఇన్‌స్పెక్టర్ - ఉన్నతాధికారి. అతడు అనుచితమైన సంకుచిత తత్త్వమును ప్రదర్శించెను. పం. లేఖరాంకు ఇంక్రిమెంటు ఆఱుమాసాలు నిలుపు చేసి ఆయనను కాలూఖా ఠాణాకు మార్చి వేసెను. దీనికేమాత్రం లేఖరాం గారు కలత చెందలేదు. ఆయనను సత్యమార్గమునుండి ఏశక్తి మరల్చలేకపోయినది.

**ఆర్యసామ్రాజ్య కాంక్ష**

పం. లేఖరాం సుఆబీ ఠాణాలో నున్నపుడు భారతీయ శిక్షాపద్ధతికి చెందిన పుస్తకం ఒకటి ఆయన వద్ద ఉండేది. దాని అట్టపై వారొక చిత్రమును వేసియుంచిరి. దానిపై భాగంలో 'ఓ3మ్' తో కూడిన ఒక ఝుండా తయారుచేసిరి. సమస్త భూమండలంపై 'ఓ3మ్' పతాకం ఎగురుచుండాలని, వైదిక మార్గం ప్రపంచంలో శిరోమణి ధర్మంగా నెంచబడవలెననెడు పం. లేఖరాంగారి దృఢమైన

కోరికను ఇది చాటుచున్నది. కానీ నేటి వరకూ పం. లేఖరాంగారి కోరిక నూరోవంతు కూడా నిజంకాలేదు ఐనా పాఠకులు పం. లేఖరాం గారి ధార్మిక భావాలను తప్పక ఊహించగలరు

పం. లేఖరాం వైదిక సంస్కారములను ఆచరించుటలో క్రియాత్మక భక్తుడు. వీరు ఇతరులకు ఉపదేశించుట కంటె ముందుగ తాను స్వయంగా ఆచరించేవారు. అన్నపానములలో భ్రష్టులైన వ్యక్తులు ధార్మిక సంస్థలలోనైతే అధికారులుగ కనబడకుండుట స్వాభావికమే. పం. లేఖరాంగారు ఒకసారి పెషావర్ వెళ్ళిరి. ఆరోజులలో ఆర్యసమాజ సాప్తాహిక సమావేశాలు ఒక తహసిల్‌దార్‌గారి ధర్మశాలలో జగుగుచుండేవి. ధర్మశాల అధ్యక్షుడైన తాసిల్‌దారు గారినే సమాజమునకు ప్రధాన్‌గా చేయాలని సభ్యులంతా తలంచుచుండిరి. ఒకనాటి సమావేశంలో స్వయంగా తాసిల్‌దార్‌గారు కూడా ఉండిరి. తాసిల్‌దార్‌గారు మాంసం తింటారని మద్యం త్రాగుతారని ఉన్నదున్నట్లుగా ఆ సమావేశంలో పం. లేఖరాంగారు ముఖం మీద చెప్పి అటువంటి వ్యక్తి సమాజ ప్రధాన్‌గా ఉండరాదని చెప్పిరి. ఇతర సభ్యులందుకు అంగీకరించకపోతే వీరు విరోధిస్తూ సభలో నుండి వెళ్ళిపోయిరి. ధర్మాత్ముడైన వ్యక్తిని ప్రపంచంలో ఏది ప్రలోభపరచలేదనుట సత్యం.

**ఉద్యోగమును త్యజించుట**

పం. లేఖరాంకు పోలీసు ఉద్యోగజీవితం ధార్మిక కార్యకలాపాలకు అవరోధంగా తోచినది. అందువలన 24 డిశంబర్ 1884 నాడు ఈ దాస్య జీవనమునకు త్యాగపత్రము నిచ్చిరి. ఇప్పుడాయన స్వతంత్రుడు. ఎక్కడికి వెళ్ళాలన్నా వెళ్ళగలరు. చేయాలనుకున్నది చేయగలరు. గ్రద్ధవంటి అధికారుల కోపతాపాలకు స్వప్నంలోకూడా తలవంచ వలసిన పనిలేదు.

**ఋషి దయానందుని లేఖ**

పం. లేఖరాం గారు పెషావర్‌లో నుండగా ఆయనకు ఋషి దయానందుని నుండి రెండు లేఖలు వచ్చినవి. ఒకటి: గోరక్షణ విషయంలో ప్రభుత్వమునకు పంపే ప్రార్థన పత్రంపై ప్రజల సంతకాల సేకరణకై పం. లేఖరాం గారికి ఆదేశం. రెండవది: పంజాబ్‌లో హిందీ ప్రచారం కొరకు విద్యా సంస్థకు నివేదన పత్రమును పంపు విషయమునకు సంబంధించినది.

పం. లేఖరాం ఉత్సాహపుంజము (కేంద్రము). ఋషి దయానందుని ప్రేరణతో ఈ కార్యాన్ని వారు ఎంతో ఉత్సాహంగా చేసిరి.

ఆర్య (హిందూ) ధర్మరక్షణ

మీర్జాగులాం అహమద్‌కాదియానీ తాను పైగంబర్‌నని చెప్పుకొంటూ యితర మతాలవారి నెందరినో తనవలలో వేసుకొనెను. ఇతని శిష్యుడు హకీం నూరుద్దీన్ సాయంతో జమ్మూకు చెందిన ఠాకూర్ దాస్ అనే హిందువు ముస్లింగా మారుటకు సిద్ధపడెను. పం. లేఖరాంగారు అనేకసార్లు జమ్మూకు వెళ్ళి హిందూ-ధర్మమును దృఢముగావించిరి. పం. లేఖరాంగారు ప్రతిక్షణం ఆర్యసంస్కృతి మరియు వైదిక ధర్మానుయాయుల హితం కొరకే గడుపుచుండిరి. మీర్జాగులాం మహమద్ కాదియానీ తాను రచించిన 'బురాహీన్ అహమదియా' యొక్క నాల్గవభాగంలో ఆర్యసిద్ధాంతాలపై ఆక్రమణచేసెను. పం. లేఖరాంగారు ఆ పుస్తకమునకు సమాధానం ఆర్యసమాజ రిజిష్టర్ మీద వ్రాయుటారంభించిరి. ఆయన ఆర్యసమాజంపై చేసే ఎటువంటి ఆరోపణనైనా ఒక్క క్షణం కూడా సహించలేకపోయేవారు. పం. లేఖరాం తన కార్యక్షేత్రమును అతి త్వరగా వ్యాపింపజేసిరి. ఏ ఆర్యుడనైనా ముస్లిం లేక క్రైస్తవునిగ మార్చుట అనేది ఈయనకా విషయం తెలియనంతవరకే సంభవమయ్యేడిది. ఆయనకు మతం మార్పిడి విషయం తెలియగానే వెంటనే వెళ్ళి ఆర్యసోదరుని పతితునికాకుండా రక్షించేవారు. అచిరకాలంలోనే వీరొక అడుగు ముందుకు వేసి క్రైస్తవులు ముస్లింలను కూడా వైదిక ధర్మ శరణులోనికి తీసుకొని వచ్చుట తన కర్తవ్యంగా చేసుకొనిరి.

ఉద్యోగంలో ఉన్నపుడే వీరు కాదియానీ మీర్జాకు సమాధానంగా వ్రాసిన పుస్తక ప్రథమ భాగాన్ని తయారు చేసిరి. మీర్జాగులాం అహమద్ కాదియానీ ఎవరైనా వ్యక్తి ఒక సం॥రం పాటు కాదియాలో తనవద్ద ఉన్నట్లైతే తన చమత్కారాలను ప్రత్యక్షంగా చూడవచ్చునని కూడా ప్రకటించెను. పం. లేఖరాం దీనిని తీవ్రంగా ఖండించి చివరకు కాదియాకు వెళ్ళి దాని రహస్యం బట్టబయలు చేసిరి. అచ్చటి సాధారణ జనులు అతని భ్రమలతో కూడిన మంటలకు ఆహుతి కాకుండుటకై వీరచట ఆర్యసమాజాన్ని కూడా స్థాపించారు.

కాదియాకు చెందిన ఒక హిందువు - విష్ణుదాసును, అతడు ఒక

సం॥రం లోగా ముస్లింగా మారకపోతే ఇస్లాం ప్రకారం చనిపోవునని మీర్జాగులాం అహమద్ మరల తప్పుడు త్రోవ పట్టించెను. ఈ సమాచారం పం. లేఖరాం గారికి టెలిగ్రాం ద్వారా తెలిసినది. అంతే. ఇంకేముంది! ఆయన వెంటనే కాదియాకు చేరుకొని విష్ణుదాసు సందేహాలను తీర్చి అతనిని ఆర్యసమాజ సభ్యునిగా చేసెను. తరువాత కూడా మీర్జాగులాం అహమద్ కుట్ర తీవ్రంగా బట్టబయలు కాసాగెను. సామాన్యులకు కూడా అతని కుట్రను గూర్చి బట్ట బయలైనది. మీర్జాగులాం అహమద్ 'సురమా చశ్మ ఆరియా' అనే పేరుతో ఒక పుస్తకమును వ్రాసెను. పం. లేఖరాం కూడా 'ను స్ఖా ఖబ్ల అహమదియా' అనే పేరుతో పుస్తక రూపంలో జవాబిచ్చిరి.

పం. లేఖరాంగారు ఇతర స్థలాలలో ఉపదేశాలిస్తూ లాహోర్‌కు కూడా వచ్చిరి. అచ్చట ఆయన ఉపదేశాలిస్తూనే సంస్కృత వ్యాకరణం కూడా బాగా అభ్యసించిరి. వ్యాకరణ సహాయంతో వారు వైదిక సాహిత్యాన్ని కూడా బాగా అధ్యయనం చేసిరి. పాదరీ ఖడక్ సింహ్ క్రైస్తవమతాన్ని సమర్థిస్తూ అఖు వ్యాఖ్యానాలు చేయగా ఆ వ్యాఖ్యానాలన్నింటినీ పం. లేఖరాం చిన్న చిన్న పుస్తకాలు వ్రాసి ఖండించిరి. తరువాత అయన 'ఆర్యగజట్ - ఫిరోజ్‌పూర్' సంపాదకులైరి. నిజానికి ఆయన సాహసం అనుసరించదగినది. ఇటు సంపాదకుని భారం, ఉత్సవాలలో పాల్గొనుట, ప్రచారం చేయుటతో పాటు అటు పుస్తకాలు వ్రాయుట మున్నగునవి కూడా ఆయన ముఖ్య కార్యాలు.ఋషి జీవన చరిత్ర

ఋషి దయానందుని నిర్వాణం తరువాత పం. లేఖరాం ఆర్యసమాజ కార్యకలాపాల విషయంలో తన బాధ్యత పెరిగినట్లు తలంచిరి. పండిత్‌జీ ఋషి దయానందుని జీవన చరిత్ర వ్రాయాలనే ఒత్తిడి ప్రతిచోట రాసాగినది. ముల్తాన్ ఆర్యసమాజమైతే తమ వార్షిక సమావేశంలో పం. లేఖరాం గారిచే ఋషి దయానందుని జీవన చరిత్ర వ్రాయించాలని ఆర్య ప్రతినిధి సభను ప్రార్థించాలని తీర్మానించారు. పం. లేఖరాంగారి నడుగగానే వారీ కార్యమును స్వీకరించిరి. ఇంతవరకూ వీరు ఎక్కువగా పంజాబ్ మరియు దానికి దగ్గఱలో నున్న ప్రదేశాలలోనే ప్రచారం చేస్తూండేవారు. కాని ఋషి జీవనమునకు సంబంధించిన సామాగ్రిని సంపాదించుటకై ఆయన సుమారు భారతదేశమంతా

తిరగవలసి వచ్చినది. ఈ కార్యభారాన్ని తనపై వేసుకున్నప్పుడే స్వామీ శ్రద్ధానందుల వారితో గాఢ పరిచయమేర్పడినది.

పం. లేఖరాంగారు ఆఖరికి ఋషి జీవన చరిత్రకు సంబంధించిన సామాగ్రిని ఏకత్రితము చేయుటకై బయలుదేరిరి. ప్రప్రథమంగా వీరు స్వామీ విరజానందుని శిష్యులైన పం. యుగళ్‌కిశోర్, పం. దామోదర్ చౌబే మున్నగువారి వద్దకు వెళ్ళిరి. వీరంతా ఋషి దయానందుని సహపాఠీలు. మథురలో కొన్ని రోజులున్న తరువాత వీరు సంయుక్త ప్రాంతంలోని యితర చోట్లకు వెళ్ళిరి. ఋషి దయానందుడు సందర్శించిన స్థలాలు, అచ్చట ఆయన చేసిన కార్యాలకు సంబంధించిన సమాచారాన్నంతా పం. లేఖరాంగారు వ్రాస్తూండే వారు.

ఇంతలోనే అజ్‌మేర్‌లో అబ్దుల్ రహమాన్ అనే వ్యక్తి 'తక్‌జీబ్' మరియు 'నుస్‌ఖా ఖబ్త్' అనే పుస్తకాలను చదివి ముస్లిం మతాన్ని విడిచి వైదిక ధర్మమును స్వీకరించెను. ఈ మత మార్పిడి మరియు ఆర్యసమాజ హేతువాద ప్రభావం పౌరాణికులు, జైనులలో కూడా అలజడిని రేకెత్తించినది. ముసల్మానులు పట్టించే తప్పడు త్రోవలకు విసిగిన పౌరాణికులు చిందులు త్రొక్కనారంభించిరి. ఆర్యయువకుల ఉడుకురక్తంకూడా ఉప్పొంగినది. వారు వేసిన ప్రశ్నలకు పౌరాణికుల నుండి ఎలాంటి జవాబు రాలేదు. వారు వేరొక మార్గంలేకకొట్లాటలు ఆరంభించిరి. 'సోమదత్తగా' మారిన అబ్దుల్ రహమాన్ అనే వ్యక్తి ఈ సమయంలో ఆర్యసమాజికులకు బాగా సహాయపడిరి. ఇట్టి పరిస్థితులలో పం. లేఖరాం అజమేర్ వచ్చిరి. ఆయన తన చాకచక్యంతోను మర్యాదా పూర్వక వ్యవహారంతోను ఇలాంటి క్లిష్ట పరిస్థితులలో కూడా చాలా పనిచేసి చూపిరి. కోపొద్రిక్తులైన విరోధులెవరైనా పం. లేఖరాం గారికి ఏమైనా హాని కలిగింతురేమోనని ఆర్యులు భయపడ్డారుకూడా. అందుకే ఆయనకు కాపలాగా ఉండుటకై నలుగురిని నియమించాలని వారు నిశ్చయించగా పం. లేఖరాం గారందుకు అంగీకరించలేదు. పైగా ఆయనవారితో మీరు పిరికివాళ్ళు. నాకెలాంటి భయంలేదనిరి. ఇచ్చట ఆయన ఒక మౌల్వీకు హిందీ కూడా చదివించారు.

**శూద్రునకు యజ్ఞోపవీతం**

మీర్జాపూర్ ఆర్యసమాజంలో ఒక శూద్ర సజ్జనుడు సభ్యుడుగా నుండెను.

ఆయన వైశ్యవర్ణమునకు తగిన కార్యము చేయుచుండెను. కానీ జన్మతో శూద్రుడు ఐనందున అంతవరకూ ఆయనకు యజ్ఞోపవీతధారణ జరుగలేదు. పం. లేఖరాం మీర్జాపూర్ వచ్చినపుడు ఆయనా సభ్యునితో "నీవు యజ్ఞోపవీతము నెందుకు ధరింపవని" అడిగిరి. అప్పుడా సభ్యుడు ఆర్యసమాజ పండితుడు తనకు యజ్ఞోపవీతము నిచ్చుటకు సిద్ధంగా లేరని జవాబు చెప్పగా పండిత్‌జీ అతనికి యజ్ఞోపవీత సంస్కారము చేయించిరి. అటువంటి పనులలో కులాలు, జాతులను పాటించరాదని పండితులకు కూడా తెలియజేసిరి. తత్ఫలితంగా జన్మతో బ్రాహ్మణులైన పండితులు కూడా ఉపనయన సంస్కారంలో పాల్గొన్నారు.

మీర్జాపూర్‌లోని ఒక గుండా మౌల్వీతో వీరు శాస్త్రార్థం చేసిరి. వేరొకరైతే భయపడి స్వరక్షణార్థం బయటికి వచ్చేవారుకారు. కానీ ఆ మౌల్వీ దుర్మార్గుడని తెలిసికూడా సాయంకాలం పం. లేఖరాం నిర్భయంగా దుడ్డుకర్ర చేతనిడుకొని భ్రమణార్థం బయటికి వెళ్ళేవారు.

తదుపరి కాశీలో కూడా ఆయనరెండు నెలలుండిరి. అచ్చట ఆయన ఓజస్వీ భాషణ జరిగినది. పౌరాణికులు విరోధించారు. కాని వారికాయన యుక్తితో సమాధానమిచ్చారు.

**విదేశాలలో ప్రచారం చేయాలనే కోరిక**

పాట్నాలో డా. షా సత్యార్థప్రకాశమును అనువాదం చేసే విషయం గూర్చి వీరినడిగినపుడు సత్యార్థప్రకాశమును ఫారసీ భాషలో అనువదించాలనే కోరికను వెల్లడించిరి. ఆఫ్ఘనిస్తాన్, పర్షియా, అరబ్ మున్నగు దేశాలకు వెళ్ళి వైదిక ధర్మ ప్రచారం చేయాలని వీరికి గట్టి కోరిక ఉండేది. ఈ కోరిక వారి జీవనకాలంలో పూర్తి చేయలేకపోయినందుకు చింతిస్తున్నాము.

**కుంభమేళాలో ప్రచారం**

12-4-1891 నాడు కుంభస్థానం. అంతకు ముందు ఒక నెలనుండి పెద్దమేళా జరిగినది. వీరు స్వామిశ్రద్ధానంద్ కలిసి ప్రచారం కొరకు ప్రకటన చేసిరి. లేఖరాం గారి లేఖల వలన పంజాబ్, ఉత్తరప్రదేశ్‌ల ప్రతినిధి సభలు కార్యక్షేత్రంలోనికి దిగినవి. పం. లేఖరాం ఎన్నో చోట్లకు వెళ్ళి విరాళాలు ప్రోగుచేశారు. కుంభమేళాలో ఆర్యసమాజంచేసిన ప్రచార కార్యక్రమముపై

సమీక్షను వీరు ఒక చిన్న పుస్తక రూపంలో ప్రచురించిరి. ప్రతి పనిని వీరు మొదటి నుండి చివరి వరకు ఎంతో ఉత్సాహంగా మనోరంజకంగా చేసేవారు.

**సింధ్‌లో**

హైదరాబాద్ (సింధ్) లో హిందువులు కొందరు ముస్లిం, క్రైస్తవమతంవైపు మారుచుండిరి. ఆర్యప్రతినిధి సభ పంజాబ్ - ప్రధాన్ వీరిని వెంటనే హైదరాబాద్ వెళ్ళి పరిస్థితులను చక్కబరచవలసినదిగా కోరిరి. ఒక ప్రముఖ ధనికుడు తన ఇద్దరు పుత్రులతోసహా మహమ్మదీయ మతం తీసుకొనుటకు సిద్ధంగానుండెను. పం. లేఖరాంగారు సింధీభాష తెలిసిన స్వామీ పూర్ణానందగారిని తనతో తీసుకువెళ్ళిరి. వీరిరువురు అచ్చటకి వెళ్ళి క్రైస్తవ, ముస్లిం మతాలను తీవ్రంగా ఖండించిరి. ఈ సందర్భంగా 'ఆదం అవ్వాలు మన తల్లిదండ్రులా?' అనే లఘు పుస్తకాన్ని వ్రాసి సమస్త మానవ సృష్టి ఒకేతల్లిదండ్రుల సంతానం కాజాలదని అనేక ప్రమాణాలతో సిద్ధపరచిరి. ఈవిధంగా వీరు అచ్చట 8,10 మంది ఆర్య యువకులను కాపాడుటతోపాటు సింధ్‌లోని ఆర్యజనులనందరిని శాశ్వతంగా అప్రమత్తంగావించిరి.

సింధీ ధనికుడు దీవాన్ సూర్యమల్‌జీ ముసల్మాన్‌గా మారుటకు నిశ్చయించుకొనెను. ఈ వార్త ఆర్యపథికుడైన పం. లేఖరాంగారికి అందగానే వారు వెంటనే అతని వద్దకు వెళ్ళిరి. సేఠ్ అలీపూర్ ప్రాంతం వైపు వెళ్ళిపోయెను. వీరు అతని పుత్రుల వద్దకు వెళ్ళి ముట్టడించిరి. పెద్దకుమారుడు దీవాన్ మేవారాం చాలాసేపు తప్పించుకో జూచెను. కాని పం. లేఖరాం తన ప్రయత్నం విడువలేదు. నాలుగు సార్లు సింధ్‌కు వెళ్ళి శాస్త్రార్థమునకై (ముబాహిసులు) పిలిచెను. ఉత్తరాల వర్షమును కురిపించెను. తుదకు మౌల్వీలు ముందుకు రావలసి వచ్చెను. సత్యస్వరూపం ప్రకటమయ్యెను. ఒక హిందూ పరివారం ముస్లింలు కాకుండా రక్షింపబడెను. ప్రసిద్ధ బ్రహ్మసమాజ వ్యాఖ్యాత శ్రీ. టి. యల్. వాస్వానీ, యం.ఏ. గారి హృదయంలో వీరు ధర్మశాస్త్రాలపై గౌరవమును స్థాపించిరి.

లర్‌కానాలో కొందరు హిందువులను నిర్బంధంగా ముస్లింలుగా మార్చివేసిరి. వారు పం. లేఖరాంగారికి ప్రార్థనా పత్రమును పంపిరి. కాని ఆ సమయంలో పండిత్‌జీ అనారోగ్యంతో నున్నందున లర్‌కానా వెళ్ళలేకపోయిరి.

ఆ పైన ఎన్నో కష్టాల తరువాత అపతిత సోదరులు తమ ధర్మములోనికి తిరిగి రాగలిగిరి. ఈ విధంగా పం. లేఖరాంగారి కోరిక ఏదోరకంగా పూర్తియైనది.

సింధ్ హైదరాబాద్ నుండి వచ్చి పం. లేఖరాం ఎక్కువగా పంజాబ్‌లోనే పనిచేయుచుండిరి. లాహోర్‌లో వీరు పౌరాణిక మతాన్ని ఖండిస్తూ చాలా వ్యాఖ్యానాలు చేశారు. అమృత్‌సర్ ఆర్యసమాజ వార్షికోత్సవంలో వీరు చారిత్రిక దృష్టికోణంతో పరిశోధనాత్మక వ్యాఖ్యానం చేసినపుడు అమరవీరుడు స్వామీ శ్రద్ధానందగారు ఆ వ్యాఖ్యానమును గూర్చి ఉల్లేఖిస్తూ హిందీ షార్ట్ హాండ్ అవసరమును గూర్చి వక్కాణించిరి. (అనగా పండిత్‌జీ వ్యాఖ్యానం అంతధాటిగా నుండెనని భావము.)

నాహన్‌రాజ్‌లో సాధువు కేశవానంద ఉదాసీ పెద్దగాలి దుమారమును లేపెను. ఆర్యప్రతినిధి సభ మంత్రి పండిత్‌జీకు టెలిగ్రాం పంపి పిలిపించిరి. పండిత్‌జీ వెళ్ళి సాధుకేశవానందతో మాట్లాడిరి. తదుపరి వీరు నాలుగు వ్యాఖ్యానాలు కూడా చేశారు. వీరి ప్రేరణతో నాహన్‌లో ఆర్యసమాజం స్థాపించబడినది.

**రాజపుతాణాలో ప్రచారం**

ఋషి జీవన సామాగ్రిని సంపాదించుటకై పండిత్‌జీ అజ్‌మేర్‌కు వచ్చిరి. అచ్చట పెద్దపెద్ద ధనికులు, విద్యావంతులు, సమాజప్రియులైన సజ్జనులను కలిసిరి. ఋషి దయానందుని జీవనమునకు సంబంధించినంత వరకూ లభించిన విషయాలన్నింటినీ వ్రాసిరి. దేశభక్తుడు చాంద్ కరణ్‌జీ శారదా, అడ్వకేట్ గారి తండ్రి బాబూ రాంవిలాస్‌జీ శారదా గార్లతో వీరికి గాఢ సంబంధ మేర్పడినది. ఆర్యజగత్‌కు పూజ్య సంన్యాసి నిత్యానందజీ మరియు విశ్వేశ్వరానంద్‌జీలు బూందీ రాజ్యంలో శాస్త్రార్థములలో నిమగ్నమైయుండిరి. వారికి సహాయం చేయుటకై పం. లేఖరాంగారిని కూడా పంపిరి. కానీ రాజా శాస్త్రార్థమునకు అంగీకరించలేదు. పండిత్‌జీ అచ్చటినుండి బయులదేరి జహాజ్‌పూర్‌కు వెళ్ళిరి. అచ్చట వ్యాఖ్యానం చేస్తుండగా మధ్యలో ముసల్మాన్ సుబేదార్‌లేచి - ఇలాగే 30 దెబ్బలు తిని బూందీనుండి ఎందుకు పారిపోయి వచ్చావు? అనెను. వెంటనే పండిత్‌జీ - “విరోధి పక్షంవారు శాస్త్రార్థం చేయుటకు రానిచో ఏం చేయ్యాలి? మేము హజరత్ ముహమ్మద్ సాహెబ్‌లా పారిపోయి

రాలేదు కదా!" అని జవాబిచ్చిరి.

వేదజ్ఞానం విస్తరించకుండా భారతదేశం వృద్ధి చెందజాలదని పండిత్‌జీ యొక్క నమ్మకం. వీరు ఉపనిషత్తులు కూడా వేదాన్తం లోనివే యని నమ్ముచుండిరి. ఉపనిషత్తులకు టీకా (అర్థం) వ్రాయాలని వీరి అభిప్రాయం. మనుస్మృతిలోని ఒక అధ్యాయానికాయన భాష్యం కూడా వ్రాసిరి. వీరు 26 రకాల మనుస్మృతులను సేకరించిరి. కాశ్మీర్‌లో వారికొక అద్భుతమైన మనుస్మృతి లభించినది. మనుస్మృతి తరువాత వాల్మీకి రామాయణాన్ని అనువదించాలని వీరి కోరిక. స్వామీ శ్రద్ధానందులు శాస్త్రాల అనువాదాలు చేయుటకొక ప్రణాళిక నేర్పరచిరి. దౌర్భాగ్యవశమున పం. లేఖరాంగారి అకాల మృత్యువు కారణంగా వారి కోరిక తీరలేదు.

అజ్మేర్‌లో పీరజీతో వీరి శాస్త్రార్థం జరిగినది. పీరజీ చాటునుండి పండిత్‌జీని చాలపొగడుచుండిరి. వీరికి పం. శివనారాయణ శాస్త్రితో పరిచయమైనది. అజ్మేర్‌లో వీరి 15 వ్యాఖ్యానాలు జరిగినవి.

**కాఠియావాడ్‌లో**

ఋషి జన్మస్థలమును గూర్చి సరిగా తెలుసుకొనుటకై వీరలేఖరాం కాఠియావాడ ప్రాంతమునకు వెళ్ళిరి. అచ్చట బాంకానెర్ ప్రాంతం మరియు మొర్వీ రాజ్యంలో తిరిగిరి. అచ్చట వారు ఆర్యసమాజ ప్రచారం దుర్దశలో నుండుట గమనించిరి. ఋషి దయానందులు ఇతర ప్రాంతాలలో వైదిక ధర్మము నింత గొప్పగా ప్రచారం చేయగా, ఆయన జన్మించిన ప్రాంతంలోని ఆర్యసమాజాలింత దుర్దశలోనుండుట చూచి ఆయనకు చాలా దుఃఖము కలిగినది.

**మాంస భక్షణపై ప్రశ్న**

పంజాబులో మాంసమును తినే అలవాటు ఎక్కువగానున్నది. ఆర్యసమాజ సభ్యులైన తరువాత కూడా ప్రజలు మాంసాహారమును ఒక్కసారి విడువజాలకపోయిరి. వారి బలహీనతకు వేదాలలో ప్రమాణమును చూపుటకు యత్నించి చాలామంది, వేదానుసారంగా మాంసభక్షణ పాపం కాదని సిద్ధపరచుచుండిరి. అట్టి విషమ సమయంలో ఆర్య ప్రతినిధిసభ ప్రధాన్ పం. లేఖరాం గారిని పంజాబుకు పిలిపించిరి. అప్పుడు పండిత్‌జీ రాజపుఠాణాలో

నుండిరి. ఆయన గట్టి యుక్తులతోను బలమైన ప్రమాణాలతోను మాంసభక్షణ సర్వథా వేద విరుద్ధమని మరియు పాపమనియు నిరూపించిరి. పం. లేఖరాంగారి యుక్తుల ముందు నిలువ గలిగిన వ్యక్తి ఎవరూ ప్రతిపక్షంలో లేకుండెను. పంజాబ్ ఆర్యసమాజంలో రెండు పక్షములు ఏర్పడిన నాటి మాట ఇది. ఒకటి గురుకుల పక్షంగా పిలువబడుచుండేది. ఇది సంస్కృత శిక్షణను గట్టిగా సమర్థించుచుండేది. రెండవది కాలేజీ పక్షంగా ప్రసిద్ధిచెందినది. ఇది పాశ్చాత్య శిక్షణనే అనుసరించాలని చెప్పుచుండెడిది. ఈ రెండు పక్షాల మధ్య పెద్ద అభిప్రాయ భేదముండేది.

### గృహస్థ జీవనం

వి.సం. 1950 వైశాఖ మాసంలో వీరి వయస్సు 35 సం॥రంలు. వీరి ధార్మిక గురువు ఋషిదయానందుని ఆజ్ఞాపాలన 25సం॥రంల వయస్సుతోనే గడచిపోయినది. దాని తరువాత 10సం॥రంలకు వివాహమును చేసుకొనిరి. జెహలంనుండి అవకాశం దొరికినపుడు తన నివాస స్థానమైన కహూటాకు వెళ్ళిరి. అచ్చటి పర్వత ప్రదేశమునందలి భన్నగ్రామ నివాసియైన లక్ష్మీదేవిని వివాహమాడిరి. అప్పుడామె వయస్సు 26 సం॥రంలు. ఈ విషయంలో వీరు పౌరాణిక లీలయైన జన్మతో కుల వ్యవస్థను పాటించలేదు. లక్ష్మీదేవి చదువుకోలేదు. లేఖరాంగారు స్వయంగా ఆమెకు చదువునేర్పిరి. ఆమె గొప్ప పతిభక్తురాలు - పతిసేవకురాలు. పతిని సంతోషపెట్టుటను ఆమె ఎల్లప్పుడూ గుర్తుంచుకొనేది. పం. లేఖరాంగారు తన పత్నికి ధార్మిక శిక్షణ నిచ్చుటకై గ్రామంలోనే ఉండాలనుకొనేవారు. కానీ మాంస భక్షణ వివాదం చెలరేగినందున స్వామీ శ్రద్ధానందులు వీరిని పిలిపించిరి.

### జోధపూర్‌లో మాంస ప్రశ్న

పంజాబ్‌లో ఆర్యసమాజం రెండు పక్షములైన తరువాత మాంస పక్షం వైపునుండి స్వామీ ప్రకాశానంద జోధపూర్ వెళ్ళిరి. జోధపూర్ మహారాజు మేజర్ జనరల్ ప్రతాపసింహ్ గట్టి ఋషి భక్తుడైనప్పటికిని వారు రాజపుత్రులలో యుద్ధము చేయు అలవాటు కలిగియుండుటకై మాంస భక్షణ అవసరమని తలంచుచుండిరి. కొందరు పత్రికా సంపాదకులు, పండితులు ధనసంపాదనకు లోబడి మహారాజు చెప్పినదానికి తలాడించిరి. తన మాటకు వారి అంగీకారమును

తెలుపుటకై పం. భీమసేన్ మరియు పం. గంగాప్రసాద్‌జీ-యం.ఏ మీరట్ గార్లను కూడా రాజా పిలిపించిరి. పం. గంగాప్రసాద్‌జీ ధనంగాని కీర్తిగాని తనను ధర్మమార్గం నుండి మరల్చలేదని మహరాజుతో స్పష్టంగా చెప్పివేసిరి. పం. లేఖరాం జోధపూర్‌లో ఉండి మాసంభక్షణను గట్టిగా వ్యతిరేకించిరి. పం. లేఖరాంగారి పక్షం గట్టిగా నుండెనని నిశ్చయంగా చెప్పవచ్చును. జోధపూర్‌లో కొన్ని రోజులుండి వారు ఋషి జీవనమునకు సంబంధించిన విషయసేకరణ కూడా చేయుచుండిరి.

**అమెరికా వెళ్ళాలనే గట్టి కోరిక**

అమెరికాలోని చికాగోనగరంలో ఒక సమ్మేళనం జరుగుచుండెను. ఆర్యసమాజంకూడా తన ప్రతినిధిని పంపుటకు తయారుచేయుచుండెను. మహారాజు ప్రతాప్‌సింహ్ పంపిన భాస్కరానంద అమెరికాలో నుండెను. ఆర్యసమాజం అతనినే తన ప్రతినిధిగా అంగీకరించాలని ఆయనకోరిక. భాస్కరానంద ఈ కార్యమునకు తగినవాడు కాడు. కావున పం. లేఖరాం దీనిని తీవ్రంగా విరోధించిరి. ఆంగ్లం తెలిసిన సజ్జనుని ఒకనిని తీసుకొని తానే స్వయంగా వెళ్ళాలని ఆయన కోరిక కాని ఏ విద్వాంసుడూ వెళ్ళుటకు సిద్ధపడలేదు. కావున తన కోరికను విడువవలసి వచ్చినది. ఆయనకు ఆంగ్లభాష తెలిస్తే తప్పక స్టీమర్‌లో చికాగో వెళ్ళియుండేవారు.

**సమయమును సదుపయోగపఱచుట**

జోధపూర్‌నుండి రాగానే అయనకు పంజాబ్ అంతటా పని పడినది. సాధారణ వ్యక్తులు చేయలేనంత అధికపని భారం ఆయనపై ఉండేది. కానీ పెద్దపెద్ద వార్తా పత్రికలకు లేఖలు పంపుట, ప్రతిచోట ప్రచారం చేయుటకు వెళ్ళుట, వార్షికోత్సవాలలో కూడా పాల్గొనుట ఇవన్నీ ఆయనొక్కరే చేయుచుండిరి.

**మూఢ విశ్వాసాల ఖండన**

పండిత్‌జీ వద్ద ఎంత తక్కువ సమయమున్నా మూఢ విశ్వాసాలను ఖండించకుండా ఆయన ఉండలేరు. ముజఫర్‌నగర్‌లో జరిగిన సంఘటనొకటి: 20 జనవరి 1894 లో తాజుల్ వార్తా పత్రికలో "సయ్యద్ జలాలీ కబ్ర (గోరీ)ను త్రవ్వి ఆ స్థలము టౌన్‌హాల్‌లో కలిపి వేయబడినది. ఇందువలన ముజఫర్‌నగర్ తాసిల్‌దార్ మరియు జాయింట్ మెజిస్ట్రేట్‌లు గ్రుడ్డివారు, పిచ్చివారైరని" వార్త

వచ్చినది. పం. లేఖరాం దీనిని అబద్ధమని నిరూపించుటకు అచ్చటి ఒక ప్రముఖ ధనవంతునితో పత్రవ్యవహారమును జరిపిరి. తరువాత ఆ పత్ర వ్యవహారాన్నంతా ప్రజల ముందుంచి నిజమును నిరూపించిరి.

ఎవరైనా హిందువులను ముసల్మానులుగా మార్చుచున్నారని పం. లేఖరాం గారికి తెలిస్తే వెంటనే ఆలస్యం చేయకుండా వారిని రక్షించుటకు వెళ్ళేవారు. శాహాబాద్‌కు సమీప గ్రామాలలో కొందరు హిందువులు ముసల్మానులుగ మారుతున్నారని తెలియుటే ఆలస్యం. అంతే. ఇంకేముంది! వెంటనే వెళ్ళి మనసోదరులను పతితులను కానివ్వలేదు. పం. లేఖరాం గారి సంపూర్ణ కార్యకలాపాలను చూచిన ఏ నవయువకుని రక్తం ఉప్పొంగదు?

**కురుక్షేత్రంలో ప్రచారం**

చంద్రగ్రహణంనాడు ఎంతో మంది హిందువులు కాశీలో గంగా స్నానం చేయుట మహత్త్వంగా భావించుచున్నట్లే, సూర్యగ్రహణంనాడు కురుక్షేత్రంలోనిచెఱువులలో స్నానం చేయుట కూడా మహత్త్వంగా భావించబడుతుంది. పం. లేఖరాం, స్వామీ శ్రద్ధానంద్ గార్లు దీనిని ప్రచారానికి మంచి అవకాశంగా భావించి స్నానదినము కంటె వారం రోజులు ముందుగానే అచ్చట ప్రచార కార్యక్రమము నేర్పరచిరి. సందేహాలు - సమాధానాలకు కూడా సమయము నిచ్చిరి. ఈ పనిని పండిత్‌జీకే అప్పగించిరి. వీరెంతో చక్కని పద్ధతితో ఆర్యసమాజం ఋషుల సిద్ధాంతాలను నిందించుట కాక వారి సిద్ధాంతాలను ప్రచారం చేస్తుందని ప్రజలకు తెలియజేశారు.

**ధర్మప్రచారానికి అమూల్యమైన సాధనం**

స్వామీ శ్రద్ధానందునితో కలిసి పం. లేఖరాం కర్నాల్ ఆర్యసమాజ ఉత్సవమునకు వెళ్ళిరి. ఆయన కాలి మడంపై పుండౌతున్నా ఉత్సాహంగా ఉత్సవమునకెళ్ళిరి. అచ్చటికి వెళ్ళిన తరువాత పుండు నొప్పి ఎక్కువైనది. చికిత్స చేయించకుండా అచ్చటినుండి కదలలేకపోయిరి. వైద్యుని పిలిపించాలనుకున్నప్పుడు అచ్చటివారు ఒక ముస్లిం వైద్యుని పేరు చెప్పిరి. వెంటనే పం. లేఖరాంగారు - "ఆర్య డాక్టర్ ఎవరూ లేరా"? అని అడిగిరి. అందుకు లాలా. కర్తారాంజీ - "ఆర్యడాక్టరైతే ఎవరూ లేరు కాని, డాక్టర్‌కు ఆర్యత్వ అనార్యత్వాలేమిటి? అనిరి. పండిత లేఖరాంగారి కళ్ళెర్రబడినవి.

కోపంగా ఆర్యసమాజం డాక్టర్లు, స్కూలు అధ్యాపకులు మరియు విద్యార్థులను ఆర్యులుగ చేయలేకపోతే అదేమి చేస్తుంది? బూడిద ప్రచారం చేస్తుందా? ప్రచారానికి ఉత్తమ సాధన మీదే (ఆర్యసమాజమే)" అనిరి. పం. లేఖరాంగారి ఈ మాటలు చాలా అమూల్యమైనవి. వీరి భావాలన్నీ సువర్ణాక్షరాలతో వ్రాయదగినవి.

**అసత్య జ్యోతిష ఖండన**

కర్నాల్ పోస్టాఫీసులో గోపాల్ సహాయ్‌జీ అనే సజ్జను డొక డుండెను. పం. లేఖరాంగారు కర్నాల్‌లో ఉన్నప్పుడే గోపాల్ సహాయ్‌కు కుమారుడు కలిగెను. జ్యోతిష్కుడు ఈ బాలుని వలన తల్లిదండ్రులకు లన్నలకు మరణగండమున్నదని చెప్పెను. గోపాల్ సహాయ్ రాబోయే ఈ కల్పిత గండం నుండి తప్పించుకొనుటకై తన పుత్రుని ఎవరికైనా యిచ్చివేయుటకు నిశ్చయించెను. పం. లేఖరాంగారికీ విషయం తెలిసినది. ఆయన వెంటనే వచ్చిగోపాల్ సహాయ్‌ను ఈ అనర్థంనుండి తప్పించిరి. జ్యోతిష్కుని మాటలు పూర్తిగా అసత్యమని నిరూపించబడినది. కుటుంబమంతా సంతోషించిరి. అంతేగాక గోపాల్ సహాయ్‌జీకు ఇంకా యిద్దరు పుత్ర రత్నాలు జన్మించిరి. జీతంకూడా బాగా పెరిగినది. పం. లేఖరాంగారి ఉపకారమును గోపాల్ సహాయ్ మాటిమాటికి గుర్తు చేసుకుంటూ సంతోషంతో ఉప్పొంగేవారు.

**క్వేటాలో వ్యాఖ్యానాలు**

వీరు ఒకసారి క్వేటా ఆర్యసమాజ వార్షికోత్సవాలకు స్వామీ శ్రద్ధానందునితో కలసి వెళ్ళిరి. అచ్చట వేర్వేరు విషయాలపై వీరు 13 వ్యాఖ్యానాలిచ్చారు. వేదప్రచారనిధి కొఱకు ధన సేకరణ కూడా ఆరంభించారు. ప్రజలపై అద్వితీయైన ప్రభావం పడినది. వెయ్యి రూ॥లకు పైగా ధనం ప్రచారనిధికి ప్రోగయ్యెను. పం. లేఖరాంగారు తన వ్యాఖ్యానాల ద్వారా అమృత వర్షాన్ని కురిపించిన ప్రతిచోటా వేదప్రచార నిధికి కూడా పూర్తి సహాయం లభించినది. పం. లేఖరాం గారి ఇటువంటి ఉపకారాలనుండి వైదిక ధర్మానుయాయులు ఋణవిముక్తులగుట కష్టం. పం. లేఖరాం క్వేటానుండి హిరక్, దాజోన్, మచ్ఛ, బోస్తాన్ మున్నగు బెలుచిస్తాన్‌లోని యితర ప్రదేశాలకు కూడా వెళ్ళి పెద్ద ఎత్తున ప్రచార కార్యక్రమాలు చేసిన తరువాత సీబీకు వెళ్ళి ఇద్దరు ముస్లింలను

అపార జన సందోహం మధ్య శుద్ధి యొనర్చిరి.

**భారతీయులను ఆర్యులుగా చేయుటకు సాధనములు**

వీరు సమస్త ప్రపంచమును ఆర్యులుగా చేయవలయుననే దృఢమైన కోరికతో ప్రణాళికలను తయారు చేస్తూ వానికై ఆలోచిస్తుండేవారు. కానీ ఈ కోరిక సఫలంకాలేదు. వారి అకాల మృత్యువు దీనికొక అవరోధమయ్యెను. ఆంగ్లభాషను సరిగా వారు అధ్యయనం చేయలేకపోయిరి. ఈ విషయంలో వీరికి ఇతరులనుండి ఆశాజనకమైన సహాయం లభించలేదు. లేకుంటే ఆర్యపథిక్ లేఖరాం గారు అవిరామ ఉత్సాహమునకు సాక్షాత్ స్వరూపం. వీరు భారత్‌ను ఆర్యులుగ చేయుటకు ఈ క్రింది సాధనాలను చూపిరి.

1. విధవా వివాహాలు పరమ అవశ్యకములుగ వీరు చాటిచెప్పిరి. అందువలన హిందువుల విధవాస్త్రీలు విమతస్థుల వలలో చిక్కుకొనరు.

2. శుద్ధి నిధిని స్థాపించుట. కొద్ది అపరాధంతో శాశ్వతంగా బహిష్కరింపబడి తిరిగి చక్కబడుటకు ఎట్టి వ్యవస్థ లేనట్టి ధర్మము ఎంతకాలము నిలచి యుండును? కనుక వీటన్నింటికి పరిష్కారం 'శుద్ధి (పునరాగమనం)యని వీరు తెలిపిరి.

3. వేద ప్రచార నిధిని స్థాపించుట, వేదజ్ఞానం లేకుండా హిందువులకు ఉన్నతి కలుగుట కఠినమని వీరి అచంచల విశ్వాసం. అందువలన వేద ప్రచారమును శాశ్వతంగావించుటకు, వేద ప్రచారనిధి నేర్పరచుటకై ప్రణాళికను రచించిరి.

4. బాల్య వివాహాలను నిలిపివేయుట.

5. ప్రతి భాషలో ఆర్యసమాజ సిద్ధాంతాలతో పుస్తకాలను ప్రచురించుట.

6. సాధువుల సంఖ్య తగ్గి, ఉన్న సాధువులంతా ధర్మకార్యాలు చేయాలి.

7. దానమునకు సరైన వ్యవస్థ నేర్పరచవలెను. దానం పేరుతో వ్యర్థంగా ధనమును నష్టం చేయరాదు.

**వీరి వ్యాఖ్యాన నేర్పు**

పం. లేఖరాంగార్కి వ్యాఖ్యానమునకు మొదట్లో యిచ్చిన సమయానికంటె ఎక్కువగా ఆయన మాట్లాడవలసి వచ్చేది. ఇచ్చిన సమయం పూర్తైన తరువాత కూడా ప్రజలాయనను మాట్లాడమని మాటిమాటికి

ప్రాధేయపడుచుండిరి. చాలామంది వ్యాఖ్యానాలు వినివిని విసుగుచెందే ప్రజలు ఆయన వ్యాఖ్యానాలలో రసాస్వాదన పొందుట వారి వ్యాఖ్యాన శైలిలోని నేర్పరితనమును తెలియజేయును. ఇంతకంటె ఎక్కువగా వీరి వ్యాఖ్యానాలలోని మరొక విశేషమేమంటే, ఇతర మతస్థులు ముఖ్యంగా ముసల్మానులు కూడా వీరి వ్యాఖ్యానాలను వినుటలో పాల్గొనుచుందురు. వీరు ఇతర మతస్థులలోని లోపాలను తెలియజేయునపుడు ఎలాంటి కటువచనాలను గాని, నిష్ఠూరమైన మాటలనుగాని పలికేవారు కారు.

వీర్తు ఋషి జీవన చరిత్ర వ్రాయుటకై లాహోరులో స్థిరంగా ఉండుటారంభించారు. కానీ ఆర్యసమాజాల వారెందరో వీరి వ్యాఖ్యానాలను కోరుచుండుటవలన వాటన్నింటినీ నిరాకరించుట వారికి సాధ్యపడేది కాదు. ఇచ్చట ఒక హిందువు ముస్లింగా మారబోవుచున్నాడని గాని, ఎవరైనా మౌల్వీతో శాస్త్రార్థం చేయాలనిగాని ఏ సమాజం నుండైనా కబురువస్తేచాలు. ఆయన ఎలాంటి పరిస్థితులలోనైనా అచ్చుటకు వెళ్ళేవారు.

**సిఖుల రక్షణ**

సియాల్‌కోటలో ఒక గుజ్జపు సైన్యంకు చెందిన సిఖుసైనికులు ముసల్మాన్‌లుగ మారుటకు సిద్ధంగా ఉన్నారని వీరికి తెలిసినది. ఇక ఒక్కక్షణమైనా ఆయన నిలువగలరా? వెంటనే ఆయన సియాల్‌కోటకు వెళ్ళి మూఢు రోజులు పూర్తిగా ముస్లిం మతమును ఖండించుచుండిరి. ఫలితంగా వందలాది ఖల్సాలు ముస్లింలుగా మారకుండా రక్షింపబడ్డారు.

**మాలెర్ కోట్లేలో శాస్త్రార్థం**

1895 సం॥రంలో వీరు మాలెర్‌కోట్లా వెళ్ళిరి. అది ముస్లింల సంస్థానం. మున్షీ అబ్దుల్ లతీఫ్‌తో పునర్జన్మపై విచార - వినిమయము (చర్చ) జరిగినది. పం. లేఖరాంగారు కొంచెమైనా సందేహించలేదు. స్వామీ శ్రద్ధానందులు సభను నిర్వహించిరి. మున్షీ అబ్దుల్ లతీఫ్ కూడా ఏదో సంకీర్ణ మనస్సుగల ముసల్మానుకాదు. ఆయన పూజ్యస్వామీ శ్రద్ధానంద్ గార్కి రూ 5/- యిచ్చి ఏదైనా శుభకార్యంలో ఖర్చుచేయమని కోరిరి.

తరువాత అక్కడే పం.లేఖరాంగారు నలుగురైదుగురు యితర ముస్లింలతో గొడవపడిరి. సంస్థానంలోని ఆర్యులు భయపడి స్వామీ

శ్రద్ధానందునితో చేతులు జోడించి ముస్లింల రాజ్యంలో యింత బాహాటంగా వివామొనర్చుట మంచిదికాదని పండిత్‌జీకు నచ్చజెప్పమని విన్నవించుకొనిరి. కాని పం. లేఖరాం ఒప్పుకుంటారా? ఆయన గర్జిస్తూ " నేను మీవంటి బలహీనులపై ఆధారపడి పనిచేయటంలేదు. మీవంటి విశ్వాసం లేని నాస్తికులకంటె నమాజు చేసే ముస్లింలు మేలు. మీకు చావంటే పెద్ద భయం" అనిరి. పం.లేఖరాంగారి నరనరాలలో వీర రక్తం ప్రవహిస్తూండేది. మాలెర్ కోట్లే ముస్లింల గ్రుడ్డి సవాలు చూచినపుడు స్వామీ శ్రద్ధానందులు పం. లేఖరాంగారిని అచ్చటనుండి బయలుదేరుటకు ప్రోత్సహించసాగిరి. కానీ పం. లేఖరాం పనంతా పూర్తి చేయకుండా బయలుదేరుతారా? ఆయన కోపోద్రిక్తులై "నేను పూటకూళ్ల యింటిలో ఉండి విరోధులను ఎదిరిస్తాను. ఈ పిరికి పందలు చెప్పినంతమాత్రాన వేదికను వదలి పారిపోలేను. వీళ్ళు ఆర్యులు కారు" అనిరి.

**భేరా ఉత్సవము**

24 మే నాడు వీరు భేరా ఆర్యసమాజ ఉత్సవంలో పాల్గొనవలెను. 15 మే నాడు లాహోర్ నుండి కహూటా వెళ్ళిరి. 18 మే నాడు వీరికి పుత్రుడు జన్మించెను. సాధారణంగా ఎవరైనా 36సం॥రంల వయస్సులో వివాహం చేసుకొని పుత్రరత్నము కలిగినచో వారు సంతోషంతో ఉప్పొంగి యితర పనుల ధ్యాస లేకుండా ఉంటారు. కాని పం.లేఖరాం అలాంటి వారుకారు. వీరు మే 22 నాడే కహూటానుండి బయలుదేరి దారిలో గూజర్‌ఖాన్, తరక్కాలలో ప్రచారం చేస్తూ 25 మే నాడు భేరా ఆర్యసమాజమునకు చేరిరి. బాలక్‌రాం అనే ఒక సాధువు ఆర్యసమాజాన్ని నిందిస్తూ తిరుగుచుండెను. అతనిని శాస్త్రార్థమునకు పిలువగా అతడు ముందుకురాలేదు.

భేరాలో 'ఈ కాలం నాటి యువకుల సాహసం' అనే విషయంపై వీరి అత్యంత ఉద్వేగభరితమైన వ్యాఖ్యానం జరిగినది. దీనిలో వ్యాయామమునకు సంబంధించిన విషయాలపై మాట్లాడుతూ వీరు - "వ్యాయామం చేయకుండా మన యువకులకు భోజనం అరుగదు. తగినంత భోజనం చేయకుండా బలమెక్కడి నుండి వస్తుంది? మన నవయువకులు రెండు - మూడు చపాతీలు తిని లేచిపోతారు. వీరికంటె ఆస్పత్రిలోని రోగి నయం. వారికి అర్ధసేరు పిండి, ఒక పావుసేరు పప్పు, ఒక ఛటాకు నెయ్యి, అర్ధపావు బియ్యం,

ఒకసారికి యిస్తారు" అనిరి. పండిత్‌జీ యొక్క ఈ వ్యాఖ్యానంతో శ్రోతలపై మంచి ప్రభావం పడినది. తరువాత ఉపదేశకులు,కార్యకర్తలు భోజనం చేయుటకు కూర్చున్నప్పుడు పం. లేఖరాం తొదరగా భోజనం చేసి లేచి పోయే వారందరినీ ప్రశ్నిస్తూండేవారు. అప్పుడు (లాలా మున్షీరాంజీ) స్వామీ శ్రద్ధానందజీ కూడా ఉండిరి. లాలాజీ పం. లేఖరాంగారి మాటలకు కట్టుబడియుండిరి. లేఖరాంగారు 17 పూరీలు తిని లేచి నిలబడిరి. కానీ లాలా మున్షీరాం అంతకంటె 2 పూరీలు ఎక్కువగా తిన్నారు. అప్పుడు పం. లేఖరాం గారు లాలాజీతో "లాలాజీ! నేను మిమ్మల్ని కేవలం ధనికుడనే అనుకుంటున్నాను. కానీ మీరు నేడు నాకు ఆశ్చర్యాన్ని కలిగించారు" అనిరి. దీని తరువాత పుత్రుడు కలిగిన సందర్భంలో తొందరలోనే సహభోజనం పెట్టాలని పండిత్‌జీని అంతాకోరారు. పండిత్‌జీ భోజన ఖర్చునంతా యిచ్చి అందరిని సంతోషపెట్టారు.

**తమ్ముని మరణం**

పం. లేఖరాంగారు బెలూచిస్థాన్‌లోని క్వేటా మున్నగు చోట్ల ప్రచారం కొరకు తిరుగుచుండగా ఆయన తమ్ముడు తోతారాం మరణవార్త అందినది. ఇంటివారైతే ఏమీవ్రాయలేదు. వారి చిన్నాన్నగారు కొంతకాలం తరువాత ఈ వార్తను తెలియజేసిరి. వీరప్పుడు సభామంత్రికి వ్రాసిన లేఖ చదువదగినది. దానిలో రెండు సమస్యలను వారు వ్రాసిరి. ఒకవైపు తాను ప్రచార కార్యక్రమాలను వదలి వెళ్ళలేరు. మరొకవైపు ఇంటికి వెళ్ళటంకూడా అత్యవసరం. చివరకు ఆయనకు ధర్మంపై గల ప్రేమ విజయమును సాధించినది. కుటుంబమును గౌణము (ముఖ్యముకానిది)గ తలచి ప్రపంచమునకు ఉపకారము చేయుట ముఖ్యకర్తవ్యంగా భావించి వీరు - " వసుధైవ కుటుంబకమ్" అను ఆర్యోక్తిని తలపింపజేసిరి. చివరకు ఇంటికి వెళ్ళలేదు. ప్రచార కార్యంలోనే నిమగ్నమైరి. క్వేటాలో కార్యక్రమం పూర్తై యింటికి వెళ్ళు అవకాశం రాగానే ఒక ముసల్మాన్ మౌల్వీ శాస్త్రార్థమునకు సిద్ధముగా నుండెనని దానానగర్ నుండి టెలిగ్రాం వచ్చినది. పండిత్‌జీ అక్కడకు వెళ్ళగానే ఎవరూ ముందుకురాలేదు. అచ్చట వీరి ప్రభావముతో కూడిన మూడు వ్యాఖ్యానములు జరిగినవి. సంధ్యోపాసన యొక్క అవసరమును గూర్చి తెలియజేస్తూ చేసిన వీరి వ్యాఖ్యానం చాలా ఉత్తమముగానున్నది. దానానగర్ మంత్రిగారి కథనానుసారం ఆనాటినుండి

ప్రత్యేక ఆర్యుడు రెండు గంటలు ఉదయం - సాయంకాలం నియమపూర్వకంగా సంధ్యోపాసన చేయుచుండిరి. సంధ్యా పుస్తకాలకు ఎక్కువ అవసరమేర్పడినది.

దీని తరువాత పం.లేఖరాం అమృతసర్ వెళ్ళిరి. మురాదాబాద్‌నుండి టెలిగ్రాం వచ్చినది. శ్రీరామ సారస్వత బ్రాహ్మణుడు క్రైస్తవుడయ్యెను. పం. లేఖరాం అతనిని మురాదాబాద్ ఆర్యసమాజ మందిరంలో 500 మంది వ్యక్తుల సమక్షంలో శుద్ధిచేసిరి. అంతా అతని చేతి భోజనమును భుజించిరి.తరువాత భోరున కురిసే వర్షంలో వీరు ధర్మశాల (పర్వత ప్రదేశం) కు వెళ్ళిరి. అచ్చట పౌరాణిక పం. బ్రహ్మానంద భారతితో వాదము జరిగినది. మహాత్మా. హంసరాజ్ పం.లేఖరాం గార్లు పట్టుదలతో వ్యతిరేకించిరి. పండిత్‌జీ నవీన వేదాంత మతమును గట్టి యుక్తులతో ఖండించి వేద ప్రమాణాలతో నియోగమును సిద్ధపఱచిరి. ఇటువంటి ప్రచార కార్యాలలో ముందు ఉదహరించినట్లుగ పండిత లేఖరాం గారు అతి ప్రావీణ్యులు. ఆయన వ్యాఖ్యానాలు - శాస్త్రార్థాలతో ప్రజలకు ప్రేరణ కలిగించుటతో పాటుగ భవిష్యత్తులో వేద ప్రచారమునకై ధనసేకరణ సాధనాలను కూడా సమీకరించుచుండిరి. పం.లేఖరాం గారి ఉపకారం ఆర్యజగత్తు వేలాది సం॥రంలు వరకు మరువలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. సత్యధర్మ ప్రచారంలో పం. లేఖరాంగారు చేయని ప్రయత్నంలేదు.

**అజ్‌మేర్ వీరత్వఘటన**

ఒక సంవత్సరం వీరు అజ్‌మేర్ వార్షికోత్సవంలో పాల్గొనిరి. నగరకీర్తనలో కూడా వీరు ఉన్నారు. దారిలో ముస్లింలతో మాటలు జరిగినవి. పం. లేఖరాంగారి మాటలతో వారు కోపోద్రిక్తులైరి. ఖ్వాజా చిశ్తీ దర్గా దగ్గరలో నున్నది. ఆర్యసమాజికులు భయపడి వెళ్ళిపోయిరి. 'భయ'మనే శబ్దం వీరలేఖరాంగారి శబ్దకోషంలో లేనే లేదు. శాన్తముగ నుండుటకు బదులు వారు దర్గా ద్వారం దగ్గఱకు వెళ్ళిరి. ఆర్యసమాజికులెవరూ అప్పుడాయనతో లేరు. ముస్లిములంతా కుతూహలంగా ఆయన పనులను చూస్తున్నారు. ఆయన దర్గా ద్వారం నుండి 30 అడుగులు లఖించి వెళ్ళి ఒక చిన్న వంతెనపై నిలబడిరి. 'కబ్రపరస్తీ' మరియు 'మర్దుమ్‌పరస్తీ'లను ఖండన చేయనారంభించిరి. విరోధులెవరూ ఆయన నేమీ చేయలేకపోయారు. ఇంతలో ఆర్యసమాజికులు

కూడా ఆర్యపథికునికి ఏమి జరిగినదో (తమాషా) వేడుక చూడటానికి వచ్చారు. ఆర్యపథిక్ ఈ విధంగా నిర్భయంగా అంధవిశ్వాసమును ఖండించుట చూచి తాము పారిపోయినందుకు ఎంతో సిగ్గుచెందిరి.

**స్వల్ప ఆదాయంతోనే సంతృప్తి**

వీరు ప్రతినిధిసభనుండి కేవలం రూ 25/- వేతనం తీసుకొనుచుండిరి. అదివారి కనీస ఖర్చుకు అవసరమైనంత. ఆయన కావాలనుకుంటే సభను అడిగి వేతనం ఎక్కువ చేయించుకోవచ్చును. కాని ఆయనకు ధనం సంపాదించే అలవాటు కంటె ధార్మిక ప్రచారం చేయుటలో ఎక్కువ ఆసక్తి యుండేది. వివాహం జరిగిన తరువాత ఆయన మాసిక వేతనంను రూ.30/- చేసిరి. తదుపరి స్వామీ శ్రద్ధానంద్‌జీ మహరాజ్ రూ. 35/- చేయించారు. ధనం సంపాదించుటకు, పేరు సంపాదించుటకు వీరు మరణించిన తరువాత ఇతర ఉపదేశకులు తమ పేరు ముసాఫిర్ అని పెట్టుకొనిరి. కాని పండిత్‌జీ ధనకీర్తులను లెఖచేయలేదు. వీరికి ధనం సంపాదించాలనే ఉద్దేశ్యం లేదు. వీరొక ఆదర్శ గృహస్థత్యాగి. వీరెన్నడూ గృహస్థ జీవితంను భారంగా భావించలేదు. ఆయన త్యాగం ఆయన ధార్మిక జీవనంతో అవలంభించబడినది కాని, అకర్మణ్యతతోకాదు. ఏలయన సంఘర్షణ ఆయన జీవితంలో పెద్ద భాగంగా ఉండేది. వేలాది మార్లు ఆయన మృత్యువు నాహ్వానించుచుండిరి. కాని ఎన్నడూ భయపడలేదు.

**పోలీసులకు సరైన జవాబు**

18 జూలై 1896 సం॥రంలో పం.లేఖరాం పసరూర్‌లో 5గురు మౌల్వీలతో శాస్త్రార్థం చేయుటకు వెళ్ళిరి. మౌల్వీలు ముందు తప్పించుకోజూచి పత్ర వ్యవహారం చేయుటలో చాలాసమయాన్ని గడిపివేసెను. కానీ పం. లేఖరాంగారు విడిచిపెట్టేరకం కాదు. చివరకు పసరూర్ చేరుకొనిరి. ఇతర మౌల్వీలంతా పూర్తిగా మౌనం వహించిరి. ఒక మౌల్వీ పండిత్‌జీ మాటలనే తిరిగి చెప్పుచుండెను. శాస్త్రార్థం జరిగే అవకాశం లేకుండుట చూచిన పం. లేఖరాం వ్యాఖ్యానాలతో వైదిక ధర్మమును గూర్చి తెలియజేయుటకు ప్రయత్నించారు.ఈ సందర్భంలో ఒక ప్రముఖ మునిసిఫల్ కమీషనర్ మథురాదాస్ ప్రచారకులతో చెవిలో గుస-గుసలాడుట ఆరంభించెను. పం. లేఖరాంగారు అతనిని

విషయమేమని అడుగగా - వ్యాఖ్యానాలవలన ఏవైనా గొడవలు జరిగితే మాకేమి సంబంధంలేదని పోలీస్ ఠాణా అధికారి చెప్పిపంపెనని జవాబిచ్చెను. వెంటనే పం. లేఖరాంగారు "అశాంతి జరగటానికి మేమిచ్చటకు యుద్ధం చేయటానికి రాలేదు. మేము ధర్మప్రచారం చేస్తాం. బాగుంటే వింటారు. మాకు పోలీసు రక్షణ అవసరం
లేదు". అని జవాబిచ్చిరి. వీరి ప్రతి మాటలోనుండి నిర్భయత ప్రకటమౌతుండేది. ఆర్యపథికుని జీవనములో వీరత్వ - నిర్భయత్వములు సాక్షాత్తుగ మూర్తీభవించిన వనుటలో ఎట్టి సందేహంలేదు.

**గులాం అహమద్ కాదియానీ శిష్యునితో సంఘర్షణ**

పం.లేఖరాంగారు శిమ్లా సమాజ ఉత్సవమునకెళ్ళిరి. మీర్జా గులాం అహమద్కాదియానీ శిష్యుడు ఖ్వాజా కమాలుద్దీన్ ముందుగానే వచ్చి అచ్చట తమ మత ప్రచారమును చేయుచుండెను. పం.లేఖరాం ప్రతిరోజు అతని వ్యాఖ్యానమును వినుటకు వెళ్ళుచుండిరి. అతడు హిందువులు, ఆర్యులకు సంబంధించిన ఏఏ విషయాలపై ఆక్షేపణ చేయునో ఆ విషయాలన్నింటికీ వీరు తన వ్యాఖ్యానాలలో జవాబిచ్చుచుండిరి. పం. లేఖరాంగారు 'హుజ్జతుల్ ఇస్లాం' అనే తన పుస్తకాన్ని గూర్చి తెలియజేసినపుడు మీర్జాగులాం అహమద్ కాదియానీ "ముహమద్ కత్తికి భయపడు. ఇస్లాంకు వ్యతిరేకంగా వ్రాయుట మానుకో" అని బెదిరించెను. కానీ ముస్లింలు పౌరాణికుల మూఢనమ్మకాలపై దురభిప్రాయంతో ఆక్రమణచేస్తూ చేస్తూ ఆర్యసమాజికులపై కూడా ఆక్షేపణ చేయుటకు వెనుకాడనపుడు పండిత్జీ తగిన జవాబివ్వకుండా ఊరుకుండేవారు కారు.

ఒకసారి ఆయన ఇస్లాంకు చెందిన పైగంబర్లు శవమును పూడ్చిపెట్టుటను సమర్థించి పాపమును వ్యాపింపజేసిరని నిరూపించుచుండిరి. ఇంతలో గుంపులో నుండి ఒక ముస్లిం యువకుడు 'ముహమద్ తవార్ను(కత్తిని) మర్చిపోకు' అనెను. వెంటనే పండిత్జీ అందుకొని 'పిరికివాడు ముహమద్ తల్వార్ను గూర్చి చెప్పి నన్ను బెదిరిస్తాడు. అధర్మమున నడిచే బలహీనులైన పురుషులకు భయపడటం నేను నేర్చుకోలేదు. నేను అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని తిరుగుతాను" అనెను.

**ధార్మిక ప్రేమకు ఒక ఉదాహరణ**

పండిత్‌జీకి పుత్రశోకం కలిగినది. వజీరాబాద్ అర్యసమాజ వార్షికోత్సవం దగ్గిరపడినది. పుత్రుడు మరణించినాకూడా వీరు తొందరగానే వజీరాబాద్‌కు వెళ్ళి ఈశ్వర స్వరూపంపై గొప్ప ప్రభావశాలియైన వ్యాఖ్యాము నిచ్చిరి. ప్రసంగ వశాత్తు ఆయన అబద్ధపు పైగంబరుల నిజస్వరూపం బట్టబయలు చేయగాముస్లిం ప్రజలు సంతోషంతో చప్పట్లు కొట్టసాగిరి.

**జీవిత విశేషాలు**

ధర్మవీర్ పం. లేఖరాంగారి దుఃఖజనకమైన మరణవార్తకంటె ముందు పాఠకులకు ఆయన జీవిత విశేషాలను గూర్చి తెలియజేయుట బాగుండును.

**దినచర్య**

ఇంతవరకూ వర్ణించిన దానిని బట్టి పం. లేఖరాంగారు 'మనసా వాచా కర్మణా' ఒక్కటని స్పష్టమైనది. అన్నమాటను స్వయంగా అక్షర-అక్షరమును దృఢముగా అమలు చేయుచుండిరి. అర్యజగత్తులో ఆయన గౌరవం ఎక్కువగా వ్యాపించుటకు కారణమిదే. వీరు నాలుగు ఘంటల రాత్రి ఉండగానే నిద్ర లేచుచుందురు. శౌచం కొరకు నగర బయటకు వెళ్ళుచుండిరి. ప్రతిదినం వ్యాయామం చేయుచుండిరి. భోజన వస్త్రధారణలలో చాలా జాగ్రత్తగా ఉండేవారు. ఒకసారి మహాత్మా మున్షీరాంగారు వీరితో పండిత్‌జీ మీరు భోజనాన్ని బాగా గుర్తుంచుకుంటారు అనిరి. వెంటనే పండిత్‌జీ అందుకొని మేము భోజనవిషయంలో జాగ్రత్తపడి మంచి భోజనం కూడా చేయకపోతే పని చేయటం కష్టమౌతుంది అని జవాబిచ్చారు. శరీరాన్ని కప్పేలోపలి వస్త్రాలను శుభ్రంగా ఉంచుకొనేవారు. పైన అలంకారం కొరకు వేసుకొనే వస్త్రాలను గూర్చి ఎక్కువగా అలోచించేవారు కారు.

ప్రతినిత్యం వీరు వేదమును, కురాన్‌ను పఠించేవారు. ఇందువలననే వీరు ఉపదేశములు, శాస్త్రార్థములను సఫలతా పూర్వకంగా చేయగలుగు చుండిరి. పోలీసువంటి ఉద్యోగంలో ఉంటూకూడా వీరెన్నడూ ఇంద్రియాలకు దాసుడు కాలేదు. మాంసం, మద్యం మున్నగు వానికి పూర్తిగా దూరంగా ఉండిరి.

సదాచారం - సామాన్య జీవనం

పాపం చేయుట మాటటుంచి సాధారణ వ్యసనాలకు కూడా క్రోసుల దూరముండే వీరు పాన్‌కూడా ఎన్నడూ తినలేదు. బట్టలు ఎంపికచేయుట, కుట్టించుట ఆయన మానసిక బలహీనతగా చెప్పుచుండేవారు. అందుకే వారి ఆరోగ్యం అత్యుత్తమంగా ఉండేది. నేటి నవయువకులవలె నిర్జీవంగాను బలహీనంగాను ఉండేవారు కారు.

ఆయనొక సాత్త్విక బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడు కేవలం జీవనం కొరకు ధనం సంపాదించాలి. వీరు కూడా అట్లే చేసేవారు. సభనుండి వారు మాసిక వేతనం రూ.30/- తీసుకొనుచుండిరి. సభ పనిపై ఎక్కడికైనా వెళ్ళితే ఎంత ఖర్చయితే అంతే తీసుకొనేవారు. ఇతర ఉపదేశకులైతే అప్పుడప్పుడు ఎక్కువగా తీసుకుంటూండేవారు. కానీ ఆయన ఖర్చులు కూడా తక్కువగా ఖర్చచేయుటకు ప్రయత్నించేవారు.

35సం॥రంల వయస్సు వరకు వీరు పూర్ణ బ్రహ్మచర్యమును పాలించిరి. వీరికి దురాచారులలోని దురాచారంతో ఏవగింపు కాని వారిని కూడా ప్రేమిస్తూండేవారు. ఎంతో మంది దురాచారులను వీరు ప్రేమతో కూడిన అస్త్రంతో బాగుచేసిరి. ఎంతటి ఆపదైనా వీరిని చలించలేకపోయేది.

**ఆర్యసంస్కృతికి గొప్ప రక్షకుడు**

పం. లేఖరాంగారు అన్ని మతాలలోని లోపాలను సమానంగా ఖండించే వారు. ఐనా పౌరాణికులు, జైనులు, సిఖులు వీరిపైన ఎలాంటి ఆరోపణలు చేయలేదు. ఏలయన వారి సంస్కరణ భావనను వీరంతా బాగుగా అర్థం చేసుకోగలిగిరి.

సనాతన ధర్మనాయకుడు మహోపదేశకుడైన, పం. దీనదయాళుగారితో ఒకసారి వీరు స్వామీ శ్రద్ధానందగారు కలియుట జరిగినది. పం. లేఖరాంగారు ఆయనతో "మీరు మమ్మల్ని నిందించటంలోనైతే గొప్ప సాహసం చేస్తారు. కానీ ముస్లింలు మీ మూలాన్ని తొలిచేస్తున్నా వారినేమీ అనలేరు". అన్నారు. అందుకు దీనదయాళుగారు యిలా సమాధానం యిచ్చారు. "ప్రజలీ పనిని మీ కప్పగించారు. పం. లేఖరాంగారు జీవించియుండగా మా మూలాన్ని ఎవరు తొలిచివేయగలరు?" తన యోగ్యత సద్గుణ సంపదలను విరోధులు కూడా

గానం చేసే వ్యక్తి వాస్తవంగా ధన్యుడు.

**పం. లేఖరాంగారి రచనా కార్యం**

రచనలో అద్భుతమైన కార్యమును జరిపి వీరు తన నామమును సార్థకం చేసుకున్నారు. వీరు చిన్న - పెద్ద సుమారు 33 పుస్తకాలను రచించిరి. ఋషి జీవితమును ముద్రించిన తరువాత అరబ్ దేశానికెళ్ళాలని వీరి ఆలోచన. ఈ ఉద్దేశ్యంతోనే వీరు ఆర్యసమాజ దశనియమాలను అరబీ భాషలోనికి అనువదించిరి. 16 పుస్తకాలను అరబీ భాషలోనికి అనువదించి తనతో తీసుకెళ్ళాలని తలంచుచుండిరి. వీరు తన రచనలలో ఎన్నడూ అసభ్యతకు చోటివ్వలేదు. చాలా మంది రచయితలు తమకు వ్యతిరేక భావాలు కలవారిపై బురద చల్లుటకు ప్రయత్నించుచుందురు.

**ముస్లింలచే ఆక్రమణ**

1893సం॥రంలో లాహోర్‌లోని ముస్లింలు వీరు రచించిన జిహాద్ మున్నగు పుస్తకాలను అశ్లీలములని చెప్పి వీరిపై దావావేసిరి. వీరి పక్షమున లాలా లాజపత్‌రాయ్‌గారు పనిచేసిరి. వీరు పూర్తిగా నిర్దోషులని నిరూపించబడి కేసు కొట్టివేయబడినది. మేరఠ్, ఢిల్లీ మరియు బొంబాయిలలో కూడా వీరికి వ్యతిరేకంగా కేసులు నడుపబడినవి. కానీ అన్ని చోట్ల వీరు నిర్దోషులని నిరూపించబడినది. ఈ విధంగా వీరొక సఫల లేఖకులుగ ధార్మిక సమాలోచకులుగ నిరూపింపబడిరి.

**మతోన్మాద ముస్లింద్వారా బలిదానం**

1897 ఫిబ్రవరి నెలలో ఒక నల్లని నీరసించిన ముఖంగల ముస్లిం యువకుడు పం. లేఖరాం గారింటికి వచ్చాడు. తాను ముందుగ హిందువునని, రెండు సం॥రల క్రిందట ముస్లింగ మార్చబడ్డానని, యిప్పుడు హిందూ మతం లోనికి పునరాగమనం కోరుతున్నానని చెప్పాడు. ధర్మవీర్ లేఖరాం గారి కింతకంటె ఎక్కువ పరిచయం అవసరంలేదు. శుద్ధి పొందుతాననే మాట విని వారి సంతోషానికి అవధిలేదు. ఆయన ఆ యువకుడినేమి అడుగలేదు. అతని విషయంలో ఇతరులనేమడుగుతారు? అతడు నీడలా ఆయనతో నుండసాగెను. అతని ఆకారం పొట్టిగాఉండి భయంకరంగా నుండెను. ప్రజలు పండిత్‌జీతో ఈ వ్యక్తి చాలా భయానకంగా కనబడుతున్నాడని, ముస్లింలు మీ

ప్రాణాలు తీయడానికి ఆలోచిస్తున్నారని, మీరు చాలా జాగ్రత్తగా ఉండాలని కూడా అన్నారు. ప్రతిచోటా ఆర్యసజ్జనులు, ముస్లింలు మీ ప్రాణాలు తీయడానికి కుట్ర పన్నుతున్నారని పండిత్‌జీని హెచ్చరించేవారు.

మార్చి 4 వ తేదీన ఈద్ వచ్చినది. ఈ భయంకర యువకుడు పం. లేఖరాంగారిని చంపుటకు ఈ రోజును అన్నింటికంటె మంచి దినంగా భావించాడు. కానీ అంతకుముందే పం. లేఖరాంగారు బయటకు వెళ్ళిరి. ఎప్పుడు పం. లేఖరాం వచ్చి తన కోరిక తీరుస్తారాయని అతడు వేచియుండెను. సభాకార్యాలయాన్నడిగి పండిత్‌జీ మార్చి 6వ తేదిన తిరిగి వస్తున్నారని తెలుసుకున్నాడు. ఆనాడు పం. లేఖరాంగారింటికి, సభాకార్యాలయానికి స్టేషన్‌కు ఎన్నో మార్లు తిరిగాడు. మధ్యాహ్నం 2గllలకు పండిత్‌జీ లాహోర్‌కు తిరిగివచ్చిరి. అతడుకూడా పండిత్‌జీ ఇంటికి వచ్చి ఆయనవద్ద కూర్చున్నాడు. సంధ్యాసమయం సమీపిస్తున్నప్పుడు పండిత్‌జీ కాగితం కలంలను క్రింద ఉంచి లేచినిలబడిరి. ఒళ్ళువిరుచుకుంటూ అలసటను తీర్చుకొనుచుండగా ఆ భయంకర యువకుడు అకస్మాత్తుగ కంబళిలో నుండి కత్తిని తీసి పొట్టలో పొడిచెను. పొట్టలో చాలా గాయాలైనవి. లోపలి ప్రేవులు తెగి కింద పడబోతూంటే వీరు ఎడమ చేతితో వాటిని నొక్కిపెట్టి ఉంచిరి. కుడిచేతితో హంతకుని పట్టుకొనిరి. ఆయనకు సహాయంచేయుటకై తల్లి, పత్ని కూడా వచ్చిరి. చేయి విడిపించుకొని ఆ దుష్ట మతోన్మాది పారిపోయెను. పండిత్‌జీ అరవనైనా అరవలేదు. ఎవరిని పిలువనైనా పిలువలేదు. కనుక ప్రక్కవాళ్ళకు కూడా సరిగా తెలియకపోయినందున ఆ కిరాతకుడు చక్కగా తప్పించుకొనెను.

పండిత్‌జీని వెంటనే ఆసుపత్రికి తీసుకువెళ్ళిరి. వైద్యుడు పేరీగారు 2 గంllల వరకు ప్రేగులు కుడుతూనే ఉన్నారు. ఒక ప్రేగు రెండు ముక్కలైనది. ఆయన పరిస్థితిని చూచి వైద్యునకే కాదు యితరులెవరికీ కూడా బ్రతుకుతారనే ఆశలేకుండెను. కాని ఆయన స్మారకస్థితిలోనే యున్నందున వైద్యుడు ఆయన జీవించుట అసంభవమని ప్రకటింపలేకపోవుచుండిరి. ఏమైనా వీరలేఖరాంగారి పరిస్థితి క్షీణించుచునేయున్నది. మృత్యువు సమీపించినది. రాత్రి పండిత్‌జీకి పరమ మిత్రులైన స్వామీ శ్రద్ధానందుని వంటి మహాత్ములు వారివద్ద కూర్చుండిరి. పండిత్‌జీకి తన వాళ్లకొరకు విచారంలేదు. ఘాతకునిపై కోపంలేదు. మృత్యువు

భయంలేదు. నిరంతరం విశ్వానిదేవ, గాయత్రీ మంత్రాలను పఠించుచుండిరి. ఆ రాత్రి సుమారు 2గం॥లకు వారు ప్రాణత్యాగం చేసిరి.

సూర్యోదయానికి ముందుగానే లేఖరాంగారు మరణించారనే శోకవార్త దావానలంలా వ్యాపించినది. ధర్మానురాగులంతా వారి మరణవార్తవిని దుఃఖించిరి. రెండు వేలమంది వారిని చివరిగా దర్శించుటకై వచ్చారు. వారి చివరి ముఖచిత్రమును తీసిరి. అమరజీవి. శవయాత్ర అనార్కలీ బజారుకు వచ్చినపుడు అచ్చట 20వేలమంది జనసమూహమున్నది. స్వర్గస్థులైన లేఖరాంగారి తల్లి గొల్లున విలపించుచుండెను. ఒక యువకుడు ఆ దృశ్యమును చూచి కళ్ళు తిరిగి పడిపోయెను.

అంతా కంట తడిపెడుచుండిరి. శవము నగరంలోనికి ప్రవేశించినపుడు శవంపై పన్నీరు చల్లిరి. నేలంతా పూలతో నిండి ఎర్రబడినది. ఏడు వేలమంది జనసమూహము స్మశానవాటికకు వచ్చిరి. వేదోక్తంగా అంత్యేష్టి సంస్కారం జరిగినది.

పండిత్ లేఖరాంగరిప్పుడు ఈ లోకంలోలేరు. ఐనా తన జీవితమును అంతులేని ఉత్సాహమును ఆర్యుల నరనరాలలో నింపిరి. ఆర్యపథిక లేఖరాంగారు ఆర్యసమాజ చరిత్రలో అమరులుగా నుందురు.

# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస్ నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061

| పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|
| 1. గోమాత | (డా॥ కోడూరి సుబ్బారావు) | 7.00 |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | " | 10.00 |
| 3. మానవ ధర్మము | " | 3.50 |
| 4. గాయత్రీ మహిమ | " | 6.00 |
| 5. వైదిక క్రాంతి పథం | " | 15.00 |
| 6. చతుర్దశ భువనములు | " | 3.00 |
| 7. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము | " | 15.00 |
| 8. యజ్ఞోపవీత వైశిష్ట్యము | " | 2.00 |
| 9. జననీ - జన్మభూమి | " | 5.00 |
| 10. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) | " | 10.00 |
| 11. యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 6.00 |
| 12. పురుషోత్తముడు శ్రీరాముడు | " | 8.00 |
| 13. వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 8.00 |
| 14. మాతా పుత్రికల జ్ఞాన చర్చ | (లోక మల్హరి) | 15.00 |
| 15. బ్రహ్మచర్య విజ్ఞానము | (టి. సూర్యనారాయణ) | 15.00 |
| 16. వైదిక అర్థనీతి | " | 2.00 |
| 17. దయానందుని ఆదర్శ రాజ్యము | " | 1.00 |
| 18. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | | 1.50 |
| 19. దైనిక అగ్ని హోత్ర విధి | | 4.00 |
| 20. THE GREAT GAYATHRI | | 2.00 |
| 21. శాంతి ప్రార్థన | | 0.75 |
| 22. మహర్షి మనువుపై విరోధమెందుకు? | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 23. వేదములలో అద్భుత విజ్ఞానము | " | 10.00 |
| 24. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ | లోకా మల్హరి | 20.00 |
| 25. ధర్మవీర్ పం. లేఖరాం | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 26. చాణక్యనీతి | (ఆ. వెంకయార్య) | ముద్రణలో |

గమనిక: తపాలా ఖర్చులు అదనము. వి.పి.పి. పద్ధతిలో సగము పైకము ముందుగనే పంపవలెను.